# బొబ్బిలి యుద్ధము



గ్రంథకర్త

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు



పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

వెల రు 1—8—0

# చరిత్రలు - కథలు

| పుస్తకము | రూ. | అ. |
|---|---|---|
| మహాత్మాగాంధి | 0 | 8 |
| జవహర్‌లాల్ నెహ్రూ | 0 | 8 |
| హిట్లర్ దురంతములు | 0 | 8 |
| సుభాస్ చంద్రబోస్ | 0 | 8 |
| చిత్తరంజన్ దాసు | 0 | 8 |
| బాబూ రాజేంద్రప్రసాద్ | 0 | 8 |
| అచ్యుత పట్వర్ధన్ | 0 | 8 |
| జాతీయనాయకులు 1 భా | 1 | 4 |
| డిటో 2 భా | 1 | 8 |
| రాజగోపాలాచారి | 0 | 8 |
| జై హింద్ (చక్కనిపద్యములు) | 0 | 4 |
| మదనమోహనమాలవ్యా | 0 | 8 |
| రవీంద్రనాథటాగూర్ | 0 | 8 |
| అబుల్ కలామ్ అజాద్ | 0 | 8 |
| జనాబ్ జిన్నా | 0 | 8 |
| నెహ్రూ ఇందిరకు వ్రాసిన లేఖలు | 1 | 0 |
| కస్తూరిబా గాంధీ | 0 | 8 |
| అజాద్ హింద్ ఫౌజ్ | 1 | 0 |
| జైహింద్ వచనం | 0 | 8 |
| స్వామి వివేకానంద | 0 | 12 |
| ఆచార్యకృపలానీ | 0 | 8 |
| భూలాభాయి దేశాయి | 0 | 8 |
| సర్దార్ వల్లాభాయి పటేల్ | 0 | 8 |
| బాలనాగమ్మకథ | 0 | 12 |

| పుస్తకము | రూ. | అ. |
|---|---|---|
| విజయలక్ష్మీపండిట్ | 0 | 8 |
| ఖాన్ సోదరులు | 0 | 8 |
| అరుణాఅసఫాలీ | 0 | 8 |
| ఛత్రపతి శివాజీ | 0 | 12 |
| పృథ్వీసింగ్ | 0 | 8 |
| ప్రకాశం | 0 | 8 |
| పట్టాభి | 0 | 8 |
| జయప్రకాశనారాయణ | 0 | 8 |
| సుభాస్ చంద్రబోస్ 200 పే॥ | 1 | 0 |
| పరారీ నేతాజీ | 1 | 0 |
| సాయిబాబా జీవిత చరిత్ర | 0 | 12 |
| రామకృష్ణ పరమహంస | 0 | 12 |
| శ్రీనాథకవిచరిత్ర | 0 | 12 |
| వేములవాడ భీమకవి | 0 | 8 |
| తెనాలిరామకృష్ణ | 1 | 0 |
| బమ్మెర పోతరాజు | 0 | 8 |
| శ్రీకృష్ణదేవరాయలు | 0 | 8 |
| నారదుని కథలు | 1 | 0 |
| సహస్రశిరచ్ఛేద అపూర్వ చింతామణి | 3 | 8 |
| నలమహారాజుకథ—వచనం | 0 | 12 |
| పంచపాండవుల అజ్ఞాతవాసం పెద్దది బైండు | 1 | 8 |
| భోజకాళిదాసు కథలు | 0 | 12 |
| కాశీరామేశ్వరమజిలీకథలు | 2 | 0 |
| పెద్దబొబ్బిలిరాజుకథ | 0 | 12 |

# బొబ్బిలి యుద్ధము

[చరిత్రాత్మక నాటకము]

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ
ఆంధ్రవ్యాస, అభినవ శ్రీనాథ, వేదవిద్యావిశారద

## శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

ప్రణీతము

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి
1955



[వెల రు. 1-

## ఈనాటకమునవచ్చు పాత్రములు

### పురుషులు

రంగారాయుడు—(బొబ్బిలిరాజు, కథానాయకుడు)
ఇనుగంటి నరసారాయుడు—(మంత్రి, సేనాని)
దామెర ధర్మారాయుడు—(ఉపమంత్రి)
వెంగళరాయుడు—(రాజు తమ్ముడు)
తాండ్ర పాపయ్య—(రాజు బావమఱది)
కాలికాని వెంకయ్య } ప్రధాన యోధులు
మంతెన బుచ్చన } ప్రధాన యోధులు
కాకర్లపూడి వెంకటరాజు } ప్రధాన యోధులు
రాముడు } (కాసాలు)
భీముడు } (కాసాలు)
రాయబారి—(విజయనగరపు సంబంధుడు)
బుస్సీ—(ఫ్రెంచి గవర్నరు)
హైదరుజంగు—(బుస్సీ మంత్రి)
విజయరామరాజు—(విజయనగరము రాజు)
మర్తెన్—(గోరందొర మిత్రుడు)
లక్ష్మన్న—(బుస్సీ దుబాసి)
హరకాలాలు—(హైదరు సంబంధులు)
హసనల్లీఖాన్—(హైదరు సేనాని)
పురోహితుడు
చినవెంకటరావు—(రాజుకొడుకు)
భటులు—స్త్రీవేషధరులు
వృద్ధకంచుకి, మఱికొందఱు భటులు మొదలగువారు

### స్త్రీలు

మల్లమాంబ—రాజపత్ని
దాసీలక్ష్మి

# హెచ్చరిక

ఈ "బొబ్బిలియుద్ధము" నాటకముయొక్క కాపీ రైటు సర్వహక్కులు మాకు చెందియున్నవి. కావున మా వ్రాతమూలకమైన పర్మిషన్ లేనిదే యే సంఘముగాని, యే సినీమానటులుగాని ప్రదర్శింపరాదు. మరియు గ్రామ ఫోను రికార్డింగు, టాకీస్క్రీనింగు, యితర భాషలలోనికి తర్జుమాలు వగైరాలు చేయకూడదు. అట్లు అతిక్రమించిన వారలు మేము జరుపు సివిల్, క్రిమినల్, చర్యలకు బాధ్యు లగుదురని యిందుమూలముగా తెలియ జేయడమైనది.

రాజమండ్రి
20—5—1944

ఇట్లు కాపీరైటు హక్కుదారులు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# పీఠిక

ఈకాలంబునం గల కవులకుఁ దమ గ్రంథములఁ బీఠికలు వ్రాయుటయం దగు నానందమింతయని చెప్పశక్యము కాదనుమాట సర్వజనవిదితమే. అందు నా రచించిన బొబ్బిలియుద్ధనాటకము మన యాంధ్రదేశమందుఁ జరిత్రాత్మకమైన పవిత్రమయిన మహానాటకం బగుటంబట్టి ఎప్పటికప్పుడు నవనవత్వమును బొంది యెన్నిమాఱులు ప్రదర్శించినను ప్రేక్షకులకును, ప్రదర్శకులకును మహానందమును బొందించుచు, మహానాటకములలో నగ్రగణ్యతను గాంచుచున్నదని చెప్పుట యతిశయోక్తి కాజాలదు. అట్టిదీనికిఁ బీఠిక వ్రాయుట యందు నాకు మిక్కిలిసంతోషమైన నీనాల్గవకూర్పునకీ పీఠిక వ్రాయు నప్పుడు నాకు సంతోషమునకు మాఱు దుఃఖమే సంభవించినది. నా విపరీతదైవంబునంజేసి తొమ్మిదిసంవత్సరముల యీడుగల నాయేక పుత్రుఁడు సుదర్శనసుధి నేఁటికి మూఁడు మాసములక్రిందట నకాల మరణము నొందినాఁడు దీనంజేసి నావంశాంకురంబు వోయినది, నా భారతమహాయత్నంబు వోయినది. నాసర్వంబునుం బోయినది. దుఃఖాయత్తచిత్తుండనైన నేనిపుడు జీవచ్ఛవంబనై యున్నవాఁడను. మాసుదర్శనుండు లోకాతీతమహామాన్వితుండును, హలకులిశాదిరేఖా సమంచితుండును, శ్రీవత్సాంకితుండును, సర్వలక్షణలక్షితుండును, పఠసంస్థాగ్రాహియును, భూతదయాపరుండును, దైవభక్తిపూరితుం డును బుద్ధిమంతుండును, సుందరవిగ్రహుండునై యల్లారుముద్దుగా నుం డినవాఁడు. ఆతండు నారచించిన శ్రీకృష్ణభారతాదిమహాగ్రంథములలోని పెక్కుపద్యములు చదువుటయేకాక ప్రతిదినమును రామాయణాదిగ్రం థముల యర్థము చెప్పుచుండును. వానికి బొబ్బిలియుద్ధనాటకములోని పద్యములన్నియు వచ్చును. ఆపద్యము లభినయపూర్వకముగా రసోచి తముగాఁ జదివి జనుల నానందింపఁ జేయుశక్తి చిఱుప్రాయమునంద

వానికలవడినది. నాయెల్ల పుస్తకములలో నీపుస్తకమందాతనికిఁ బ్రీతి మెండుగావున వానియాత్మశాంతికై యీ నాటకరాజం బా ముద్దుల కుమారునిపేర నంకితముచేసి నాదుఃఖమించుక చల్లార్చుకొనందలంచితినని విన్నవించుచున్నాను. శ్రీ. కృష్ణమూర్తిశాస్త్రి

అయిదవ కూర్పులోఁ గొన్ని కొన్ని స్థలములయందుఁ జిన్న చిన్న మార్పులు చేసితిని. పాఠకుల కోరిక ననుసరించి మొదటి కూర్పులోనున్న పద్యము లన్నియు మరల నిందుఁ జేర్చితిని. నాటకులవి ప్రదర్శనములలో విడువ వచ్చును. శ్రీ. కృ.

## ఆఱవకూర్పుపీఠిక

పరమేశ్వరానుగ్రహము వలన మా బొబ్బిలి నాటకమునకు నాటక రాజమని పేరువచ్చినది. ఇప్పుడేపురములో బొబ్బిలినాటకము ప్రదర్శించినను మా యీనాటకమునే ప్రదర్శించుచున్నారని వ్రాయుటకు మిక్కిలి సంతసించుచున్నాను. శ్రీ. కృ.

## ఏడవకూర్పు పీఠిక

ఈనాటకరాజమును సినిమాలోనికి నెక్కింపవలయునని మొందలో ప్రయత్నించుచున్నట్లు వినియుంటిని కాని యిప్పటి కాప్రయత్నము కొనసాగ లేదు. ఇద్దఱు ముగ్గురీనాటకము నాయొద్ద నుండికొనవలయునని సంకల్పించి నన్నుఁగోరిరి. నేను వారుకోరినట్టులమ్మి వేయవలయుననియే యెంచితిని. అట్లు రెండు సంవత్సరములు కడచెనుగాని నాటకము నన్ను విడువలేదు. ఇట్లుండ నీసంవత్సరము మే 20 తేదీని రాజమహేంద్రవరమున గొప్పపుస్తక వ్యాపారియగు శ్రీ కొండపల్లి వీరవెంకయ్యగారికి పుస్తకము కాపీరైటుహక్కులతో నెల్లహక్కులు విక్రయించితిని. ఇంతటినుండి వారే యీ పుస్తకమున కధికారులై ముద్రణాదికము గావించి విక్రయించుకొనుచుందురని విన్నవించుచున్నాను.

శ్రీ. కృ. శాస్త్రి

# అంకితము

శ్లో. ఉక్త్వాజీవితనాటకస్య చరమా మోంతత్పదిత్యుత్తమా,
ముక్తిం ముక్తిమితోగతోఽధికధియా దేహంత్యజన్ భౌతికం
ఆత్మా మే సుతరూపతః ప్రతికృతో దివ్యంరధై తూన్నతం
నిత్యానందసుఖం సుదర్శనసుధీప్రఖ్యాతనామాంచితః

సీ. ఎవ్వాఁడు శ్రీవత్స ♦ మేయనఁ దగు బొడ్డు
మచ్చతో జన్మించి ♦ మహిమఁగాంచె
నెవ్వాఁడు తొమ్మిది ♦ యేండ్లు నాయింటిలో
నల్లారు ముద్దుగా ♦ నైతలిర్చె
నెవ్వాఁడు బాలుఁడై ♦ యెసక మెసంగియు
నెల్ల వృత్తాంతము ♦ లెఱిఁగికొనియె
నెవ్వాఁడు చెప్పిన ♦ దెల్లనౌ కానౌక
సంతసగ్రహియించి ♦ చదువనేర్చె

గీ. అతఁడు వేదశాస్త్రప్రియుం ♦ డమలమూర్తి
దేవతాంశభవుండు సు ♦ ధీ విధేయుఁ
డార్యధర్మప్రియుండు మ ♦ దాత్మజన్ముఁ
డమరుఁ డగుఁ గావుత సుదర్శ ♦ నాహ్వయుండు.

వ. అట్టి లోకోత్తర గుణోత్తరుండు నాకుఁ గుమారుండై పుట్టి స్వల్పకాలంబున సకలధర్మంబు లెఱింగి దైవప్రేరణంబునం జేసి పరమపదం బలఁకరించియు నాయాత్మం బెడఁబాయకుండె. అట్టి నా పట్టి సుదర్శనసుధి కాత్మశాంతియు మనఃప్రియంబు నగునట్లుగా వాని కీ నాటకరాజం బంకితంబుచేసి సఫలీకరింపఁబడియె.

శ్రీ. కృ. శాస్త్రి.

# బొబ్బిలియుద్ధము



## ప్రథమాంకము



### నాంది

శ్రీలన్ మేలిమిఁ గాంచి దుష్టుల సమ ♦ ష్టిన్ స్వాభిమానంబు వో
శీలంబున్ విడి ద్రోహు లైనఖలులన్ ♦ శిక్షింప రక్షింప భ
క్తాళిం, బొల్చినగరంగనాయకుఁడు మీ ♦ కౌదార్యమున్ శౌర్యమున్
శీలంబున్ స్వజనాభిమానమును వా ♦ సిం గూర్చి రక్షించుతన్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—అతిప్రసంగమేల?

తే. గీ. మాన మభిమానమును గల్గి ♦ మంచివృత్తి
నొరులప్రాపున కాశింప ♦ కుండ నెంచి
భరతవర్షంబునం బుట్టి ♦ భారతీయు
లైన దేశాభిమానుల ♦ కంజలి యిది.

(తెరవంకఁ జూచి)

నటీ! యేమి చేయుచుంటివి యొకమా టిటురా?

నటి—(పాడుచుఁ బ్రవేశించి) ఆర్యా! నమస్కారము. దాసురాలి కేమియాజ్ఞ?

సూత్ర—ప్రేయసీ! దేశాభిమానులును, శౌర్యనిధులు నగు నీసభాస్తారు లెల్లరును "నేఁడొక్క వీరరస ప్రధానరూపకముఁ బ్రదర్శింపు" మని నాకాజ్ఞాపించినారు. తదనుగుణం బైన మహానాటకం బేదియో విచారింప వలయు నని నిన్నిట్లు పిలిచితిని.

నటి—ఆర్యపుత్రా! సర్వజ్ఞులకుఁ దెలియని దేమున్నది? ఈముద్దరాలా మీకుపదేశించునది? దేవా! యీశరచ్చంద్రచంద్రికా ప్రసారంబువలె సారతరంబైన మీహృదయకమలంబునం దించుక విచారింతురేని సర్వమును మీ కరతలామలకం బగు

శా. జెల్లుంబువ్వులు తెల్లదివ్వెలగుచున్ ♦ రేయుంబవళ్ళుం గమున్
దెల్లంబై వెలుఁగన్ దిశావలయముల్ ♦ దేజంబునం గ్రాలను
త్ఫుల్లాంభోరుహగర్భ సౌరభము సం ♦ పూర్ణంబుగా భూతలం
బెల్లం గ్రమ్మఁగ నెల్లవారిమది కెం ♦ తేని న్వికాసంబిడున్

సూత్ర—కాంతా! ఎంతచక్కఁగా జ్ఞప్తికిఁ దెచ్చితివి? ఏమి యీశరదృతు ప్రభావము!

క. బెబ్బులులు రేఁగిమిక్కిలి, యుబ్బున జృంభించునట్టు♦లూహింపంగా
బొబ్బిలివారలయుద్ధం, బబ్బబ్బ యనంగ వీరి ♦ కబ్బుర మిడదే,

నటి—ఆర్యపుత్రా! ఆబొబ్బిలియుద్ధ మంతయు రూపకరూపంబునం గన్పట్టు చున్నదియా?

సూత్ర—లేక యేమి?

తే. గీ. సృష్టికిం బ్రతిసృష్టిని ♦ జేసినట్టి
కౌశికుని గోత్రమందు వేం ♦ కటమనీషి
కాత్మజుం డయి పుట్టిన ♦ యట్టివాఁడు
కృష్ణకవిరాజు దలఁపఁ ద ♦ త్కృతికి గర్త.

నటి—ఆహా! కవిరాజకృతియె కలిగినం గొదువయేమి?

సూత్ర—దేవీ!

ఉ. వీరరసప్రధాన మయి ♦ విశ్రుతి కెక్కిన నాటకంబులం
బేరు వహించి రౌద్రమును ♦ బీరముఁ బెచ్చు పెరింగి సోరికిన్
భూరిభయానకం బనెడు ♦ బుద్ధిని బుట్టఁగఁ జేయు నిట్టిచో
నా రసవంత మైనకృతి ♦ నాడి బహూకృతి నందు మీవిటన్

నటి—ప్రాణేశ్వరా! నాకా నాటకము పేరు విన్ననే భయమగు చున్నయది. మఱి యా బొబ్బిలియుద్ధరంగమున బేల నగు నేనెట్లు ప్రవర్తింపఁ గలను?

సూత్ర—అది నిజముగా బొబ్బిలియుద్ధరంగమే యనుకొంటివా యేమి? బొబ్బిలియు లేదు యుద్ధమును లేదు. వీరు లన్న పేరుగాని వారును లేరు. అదియంతయు నాటకాభినయముకాని భయము లేదు.

(తెరలో)

ఓరోరి! క్రూరా! అసత్యప్రలాపసంపాదిత మహాపాతకవర్తీ! పాపాత్ముఁడా!

చ. ఎవఁడుర నీవు బొబ్బిలిపు ♦ రీశ్వరమున్నఁటి వారియుద్ధమున్
ప్రబిమల శౌర్యమున్ వితఁగఁ ♦ బల్కుచు లే వనుచుంటి వేమిరా?
భువి నరికంఠ లుంఠన స ♦ ముద్భవ తేజుఁడు తాండ్రపాపరా
ట్ప్రవరుఁడు ఖడ్గహస్తుఁడయి ♦ ప్రస్తుతికెక్కనటం చెఱుంగవా?

సూత్ర—(భయసంభ్రమములతో) అమ్మయ్యో! పులి పులి, బొబ్బిలి పులి వచ్చిపడుచున్నది. పద పద; ప్రాణములు దక్కించు కొందము. (అని నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన

---

[అంతఁ బై పద్యమునె చదువుచుఁ గత్తి దూసికొని తాండ్రపాపా రాయఁడు ప్రవేశించుచున్నాఁడు]

పాపా—(పరికించి) ఓరోరి! శైలూషాధమా! నీవెందుఁ బోయితివిరా? విజయరాము నట్లు వీరాలాపంబు లాడు నీ నాటకాభినయం బంతయు నెంత భీభత్సమై భయానకంబుగాఁ బరిణమింపఁ బ్రవర్తిల్లఁ జేసెదనో చూడురా? (అని కత్తిం ద్రిప్పుచున్నాఁడు)

(తెరలో)

శా. వీరాలాపము లాడుచుంటివిర? దే ♦ వీయుద్యమం బుంటి గం
భీరారావ మెసంగఁ జాలు నిసి! నీ ♦ బీరంబు ఘోరాహవ

క్రూరాస్త్రంబులు తాఁకెడం జెడుశత్రుం ♦ గ్రొంచెంబగుం జూడుమో
రోరీ! బొబ్బిలి బెబ్బులం జెఱుఁగవో ♦ యున్మాదమో దుర్మతీ.

[అని చదువుచుఁ గత్తిదూసుకొని వెంగళరాయఁడు ప్రవేశము]

వెంగ—(పరికించి) బావా! ఏడీ? విజయరాముఁడనుచుంటివే సీ? నేఁడీ కరవాలంబున కాతనింబలియిచ్చి జగంబునం దీబొబ్బిలి బెబ్బులి యనం దోఁపఁ జేసి వాసి కెక్కెడంగాక. (కత్తిం ద్రిప్పుచున్నాఁడు)

పాపా—(శాంతించి) వెంగళరాయా! నీ యంతరంగంబెప్పుడును దుష్టశిక్షణమందే యుండును గావున విజయశబ్దము వినినంతనే నీకా దుష్టాత్ముఁడగు విజయరామరాజు స్మరణమునకు వచ్చినాఁడు కాని యతఁడు గాడు సుమీ! ఎవఁడో శైలూషాధముఁడు.

వెంగ—పాపరాయాగ్రణీ! అది యట్టిదియా? కాని, విజయరామరాజు మనపై నంత ద్వేషించి యుండుట కేమి కారణము?

పాపా—విజయనగర రాజులకును బొబ్బిలిరాజులకును నెప్పటికి నీ యాంతఃకలహంబు లున్నవియే విశేషించి విజయరామరాజు క్రూరుం డగుటం జేసి మునుమున్న చిరకాలాయుధద్యూతంబున మనచే నోటువడి నది మొదలు నేఁటివఱకును మన శౌర్యధైర్యాధులకుం జూపోపక మన మన మసలుచిత్తంబున నుత్తలపడుచున్నవాఁడు. మన మతనిచేతి క్రిందివార మని తనలోఁ దాన గర్వించుచుండు. అతండు మొన్న మనవారు మనకొండలనుండి వారి కేదారంబులకుం బాఱుసెలయేళ్ళకుం గుఱివిళ్ళు కట్టిసెళ్ళు మనతట్టు మళ్ళించుటం జేసియేగాక నేనప్పుడ్మనాభంబునకుం బులివేఁట వచ్చినవారిం దూలించుటం బట్టి మఱింత మండి పడుచున్నవాఁడు. అతఁ డెంతమండిపడి యేమిచేయఁగలఁడు?

వెంగ—బావా! అది యట్లని వానిపట్ల మన ముపేక్షఁ జేయ వచ్చునా? ఉపేక్షించిన నతండు సమయము పరీక్షించి పైఁబడి పరాక్రమింపకుండునా? శత్రు వలంతి యని తలంచుట రాజనీతియా?

క. ఈమన్నాప్రతుఁడై యైనన్, ద్వేషించినవాని ద్రుంచ [illegible] శ్రీ
   శ్శైవమంన శేవయేత్తను, భాషణముభిభూమ [illegible]

ఇదిగాక నీ కావిజయరామరా జలంబిక [illegible]

క. నవలక్షకళింగాఖ్యా, త్యవనికి నధినాయకుండు [illegible]
   యువనేశప్రియుఁడుం డం, త్రవిదుం డావిజయ [illegible]

పాపా—(పరిహసించుచు) బావా! నీవింత [illegible] నేనన్న
దును దలంపనైతినిగదా! మనకు గర్భశత్రుడైన విజయరామరాజు
శౌర్యాదికముం గుఱిచేసి భట్టువలెం బొగడుచుంటివి! పరాక్రమైకజీవ
నులగు మీవంటివారినైనఁ దలంపవైతివిగదా! మీ కేగాక వెలమ
కులంబున కంతకును నపకీర్తిఁ దెచ్చు ముచ్చట లుచ్చరించుచుంటి
వక్కటా! కాలమహిమ! పులిపిల్ల పిల్లికిం జడిసి పాఱు నట్లయ్యెఁగా!

వెంగ—(భీకరంబుగా నొక్కమాఱు హుంకరించి) అఁ! ఏమి
యిట్లంటివి? వెలమబిడ్డనైన నన్నే పిఱికి గొడ్డనుచుంటివా? నేనా నా
వారి కపఖ్యాతిం దెచ్చువాఁడను! నీశౌర్యం బేపాటిదియో పరీక్షింపఁ
గోరి శత్రువుకొలందియిట్లున్న దంటినిగాని భట్టునై భయంపడిపొగడ
జొచ్చితి ననుకొంటివా?

క. చిచ్చుఱికి చొకళింతున్, జిచ్చఱపిడుగుబను నైనఁ జేపట్టి వెసన్
   విచ్చలవిడిఁజెరలాడెద, ప్రచ్చెద జముబంట్లఁబట్టి వంగన మెన్నన్
                                        (అని యూడుఁగఱచి రోజుచున్నాఁడు)

పాప—బావా! నీకెంత పూనిక యున్నదో నే నెఱుంగఁ గోరి
యిట్లంటిని గాని నీధైర్యస్థైర్య గాంభీర్యాదులు నే నెఱుంగనివియా?
లోకం బెఱుంగనవియా?

ఉ. కోటిశతఘ్నులొక్కపరిఁ గూడి గుభాల్ గుభనిస్వనంబుతో
   మేటిగఁ బ్రేలుచున్నతఱి మించినశత్రుబలార్ణవంబునన్
   బోటరివై చొరంబడి యభూతపరాక్రమవిక్రమంబునన్
   దీటడఁగింపవే పగఱ నారణపద్ధతు లే నెఱుంగనే.

నామాటలకు నీవన్యథాభావంబు భావంబునం దగుల నీకుము, దీనిని బరిహాసకంబుగాఁ బరిగణించితివేని శాంతించి నన్ను దయజూడుము.

(అని చేతులు పట్టుకొనుచున్నాఁడు.)

వెంగ——(శాంతించి) వెలమకులంబున కపకీర్తి యను నీ మాట నన్నెక్కింత బాధించె. మహాబలపరాక్రమవంతుడవైన నీవు నన్నుఁ బురికొల్పుట కని యందువుగాని మఱియొకటి గాదు. దాని కే మది యటుండనిమ్ము. విజయరామరాజు ప్రవర్తనంబిపుఁ డతికాపట్యంబున బోలఁదోఁచుచున్న దేమి ?

పాపా——అతఁ డెప్పటికిం గపటియే కాని నీ విప్పు డిట్లనుటకు గారణమేమి ?

వెంగ——విజయరామరాజిపు డన్నగారియొద్ద కొక రాయబారిం బుచ్చినాఁడు.

పాపా——హా! హా! మన మహారాజు రాయబారి మాయలోఁ బడలేదు కదా ?

వెంగ——వాని మాయలోఁబడుట కన్నగారి కంటెఁ బడక మున్నె వాఁడు నా చేతిలోఁ బడెఁనాఁడు.

పాపా——ఏమివృత్తాంతము ?

వెంగ——ఆ రాయబారి చేత నొక జాబుఁ గొని మహారాజదర్శనం బునకయి హజారముకడ వేచియుండెను. అంతలో నెట కేనిఁ బోవు నే నటఁ దారసించి తమదంత బంతయు నాకర్ణించి వానియొద్దనుండి పత్రికంగొని బహూకరించి సాగనంపితిని.

పాపా——ఏమిచ్చి బహూకరించితివి ?

వెంగ——రెండుచపేటంబులును నొకయర్ధచంద్రప్రయోగంబును.

పాపా——వాని నంత జేయ నవసర మేల వచ్చెను? పత్రికా విశేషం బేమి ?

వెంగ — రామరాజుపై నాగ్రహమే కారణము. మఱి పత్రికా విశేషంబు వినుము. గోలకొండ సర్కారునుండి బుస్సీసపరివారుండై హైదరుజంగుతో జమాబందీ! వచ్చి రాజమహేంద్రవరముకడ విడిసి యుండుట మనము నెఱింగియున్నదేకద?

పాపా — సరే! విజరాముండనున దేమి?

వెంగ — "కతిపయసేనా సమేతంబుగా బుస్సీ ప్రభృతులు వచ్చి యున్నారు. పెచ్చుపన్నుగట్టవలసిన మనమిపుడు పూర్వవైరములుగ డించుకొనక చతురంగబలంబులం గూడిపోయి పన్నిపుడు కట్టలేమని చెప్పుదము. దానికివారొప్పుకున్నఁ జేయవలసినపని జేసివత్తముఅని"

పాపా —

శా, ఔరా! యెంతటితంత్రవాదిరొయి కళింగాధీశ్వరుండెన్నికో ట్లోరూప్యంబులుపన్నుగట్టఁ జగి మెఁ నోర్నియెండ్లుతానుండివా రేరా పైకమురాదటం చడుగ రా నీ లేక యెట్లాడియో భారంబున్ మననెత్తివేయుటకుఁ గాఁ బన్నెంజుమీయాగతిన్

ఇంతియెకాని మనపయి దయచేత వర్తమాన మంప లేదు. మనము వానిమాట విని మోసపోయి వానివెంటనంటిపోయిన నెటుపోయి యెటువచ్చునో! ఎంతమోసము! యెంతమోసము! పగతు తెంతకయినం జాలియుండునుకదా!

గీ. తన్నుఁ బ్రక్కలోన నన్నుబల్లెం బని
తలఁచు దాయ వచ్చి తలను ముట్టి
బాస చేసి నేని దోసిలి యిడె నేని
విశ్వసింపరాదు విజ్ఞుఁ డెపుడు.

(తెరలో) హా! కరుణాంతరంగితాంతరంగా! హా! బొబ్బిలిపురాధీశ్వరా! హా! రంగారాయమహారాజ! నిరపరాధిని నన్ను రక్షింపుము రక్షింపుము. (అని రోదనము)

చ. అభయ మొసంగినాఁడ భయ♦మందకు మింకిట నార్తలోకమా!
త్రిభువనకంటకాపహవ ♦ రక్షకృపాణుఁడ రంగరాయభూ
విభుఁడను వచ్చుచుంటి నొక ♦ వ్రేల్మిడి నీవెతలెల్ల దీర్చి నిన్
విభవసమేతుఁ జేసెదను ♦ నిక్కము నిక్కము విశ్వసింపుమా.

పాపా—యువరాజా! మన మహారాజు నీచే వ్రేటువడిన రాయబారి కథ ముప్రదాన మొసంగ భయంకరప్రకారంబున నిట వచ్చుచున్నవాఁడు. మన మిపుడిట నున్న నేమివచ్చునోపోవుదము రమ్ము.

(అని నిష్క్రమించుచున్నారు)

ఇది విష్కంభము

---

(స్థలము : బొబ్బిలిలో సభాభవనము)

[అంతటఁ బైపద్యముఁ జదువుచు రంగారాయఁడును, గాళ్ళమీఁద పడి దుఃఖించు రాయబారియును బ్రవేశించుచున్నారు]

రంగా—(లేవఁదీయుచు)

శా. ఓయీ! యింతదురంతచింత యిటులే ♦ లోనీకు సంప్రాప్తమై
వాయెండం దురపిల్లఁ జేసెడిని? నీ వాసఃప్రదేశం బదే
దో యెం దేగుచు నిందు వచ్చితివో యే ♦ రో నీవు నీవృత్తమె
ట్లో యాథార్థ్యమెఱుంగఁ జేయుము తెఱం♦గున్నట్లుగావించెదన్

రాయ—(లేచి) మహారాజా! నేను విజయరామరాజపురందరుని సందేశంబున రాయబారినై విజయనగరంబునుండి దేవర దర్శనార్థ మిట వచ్చినాఁడ.

రంగా—చిఱునగవుతోఁ (దనలో) ఓహో! యిది పరమాశ్చర్యము. కానీ; విచారించెదంగాక. (ప్రకాశముగ) సరే! తరువాత?

రాయ—తరువాత నేమి చెప్పుదు నో మహారాజా! నేను దేవర దర్శనార్థము హజారముకడఁ బ్రతీక్షించుచుండ నటకు వెంగళరాయ నృపాలుం డరుగుఁ దెంచె.

రంగా—(తనలో) ముందుడుకువాఁ డతఁ డితనిం బ్రహరించెఁ గాఁబోలు (ప్రకాశముగ) తరువాత ?

రాయ—అతండు నావృత్తాంతం బంతయు విని నన్నుఁ జెంపలు వాయఁ గొట్టినాఁడు. మహారాజా! రక్షింపుము. రక్షింపుము.

రంగా—(తలపంకించి) ఆఁ! వెంగళరావే యిట్లుచేసినాఁడా? కానీ; విచారించెదంగాక, చింతింపకుము. ఓరీ యెవఁడురా! అక్కడ

సేవకుడు—(ప్రవేశించి) హాసాము మహారాజ! దాసునకేమియాజ్ఞ?

రంగా—నీవు పోయి నరసారాయ వెంగళరాయలం దీసికొనిరా?

సేవ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

రంగా—రాయబారీ! విజయరామరాజుగారికి మాపై నింత యనుగ్రహము కలుగుట కేమి కారణము ?

రాయ—రాజా! మారాజేంద్రుండు గుణగ్రహణదక్షుండు గాని ప్రాతపగలం బురస్కరించుకొని పట్టినపట్టునే విడువనట్టివాఁడుగాఁడు.

రంగా—సరే! యిప్పుడేమికారణంబునం జేసి నిన్నిటకుఁబుత్తెంచెను?

రాయ—సర్వమును విశదంబుగా నొక జాబు వ్రాసి యేలినవారి కిమ్మని నాచేతి కిచ్చినాఁడు.

రంగా—అదేది ?

రాయ—వెంగళరావు దానిం దీసికొనియె.

రంగా—ఒకరివస్తువు నొండొకరి కిచ్చుట దూతకృత్యమునకు దూష్యము గాదా?

రాయ—చిత్తము రాజాధిరాజా! తానే మహారాజు నని చెప్పి యతండు నాచేతినుండి జాబూడలాగుకొని న న్నదఁచినాఁ డీ తప్పు క్షమింపుము దేవా!

(తెరలో) ఓరోరీ! యసత్యవాదీ! నిత్యమహాపాతకచక్రవర్తీ! సత్యసంధుం డయిన మహారాజుకడ నిట్లసత్యముగాఁ బ్రేలుచుంటివేమిరా?

ఉ. దుష్టుఁడ వీవు దుష్టునకుఁ ♦ దోడ్పడి వచ్చితి రాయబారివై
శిష్టజనప్రకీర్ణ మగు ♦ చెన్నల రాజెను రావువారి యు
త్కృష్టసభాస్థలంబునఁ బ్ర ♦ తిష్ఠితుఁ జేయుట దోషమౌ నినున్
గష్టుఁడ బెద్ద చేసి శున ♦ కంబును బల్లకి నిల్పు టొప్పునే.

[అంతఁబై పద్యమును జదువుచుఁ గత్తిదూసికొని వెంగళరాయఁడును అనుసరించి శాంతిం జూపు నరసారాయఁడును బ్రవేశించుచున్నారు.]

నర—కుమారా! శాంతింపుము. నీచేయి మిగిలినప్పుడు మీఁదు మిక్కిలి నీ విట్లు క్రోధవచనంబు లుచ్చరించుట తగదు. ఎంత క్రోధమున్న నంత శాంతి బూనుటయే మనబోంట్లకు విభూషణంబు. మాయన్న రంగారాయఁడు నీచేత కాగ్రహించియే నిన్నిట్లు పిలువం బంచె. అతం డెదె సింహాసనాసీనుండై యున్న వాఁడు. నీ మాట విన్న నతని చిత్తం బన్యథాయత్తం బగుఁ గావున శాంతించి మహారాజు ననుసంధింపుము; వినయంబునఁ బ్రార్థింపుము.

ఉ. చిన్నవు నీవు నింటి కగు ♦ పెద్ద పితృప్రతిమానుఁ డన్న శౌ
ర్యోన్నతకీర్తి విజ్ఞుఁడు ప్ర ♦ భూత్తముఁ డుత్తముఁ డాతఁ డట్టిమీ
యన్నమనంబు వట్టి మన ♦ మందఱునుం జన నొప్పుఁగాని యీ
చిన్నతనంపు దుందుడుకు ♦ చేష్టల నిష్టము రొప్పనొప్పునే?

వెంగ—పెద్దలు మీరు మీ చెప్పిన యొప్పునం బ్రవర్తించెదంగాక
(అని సమీపించుచున్నాడు.)

నర—(సమీపించి) జయము జయము మహారాజ!

రంగా—మంత్రివర్యా! రమ్ము; పీఠం బధిష్ఠింపుము.

నర—(ఉపవిష్టుఁడగుచున్నాఁడు.)

వెంగ—రాజుపాదములకడ సాఁగిలబడి నమస్కరించుచున్నాఁడు)

రంగా—వెంగళరాయా! నన్నింత పెద్దఁ జేయుచుంటివేమి? నీవె మహారాజవు కావున రమ్ము సింహాసనం బెక్కుము.

వెంగ—(భయ మభినయించుచు) మహారాజా! ఏమి యిట్లను చుంటిరి? నాకడ మహాపచారం బేమి?

క. అన్నవృపతికృపయుడవుమటివన్నుప్రేమించుమ పెంచునరనాథుడవున్
విన్నది కన్నదిగాదిటు, లన్నా! తప్పన్న నైపు ♦ మాక శూలోడన్

రంగా—వినయధురీణా! ఈ వినయంబుల కేమి కాని వీనితో నేమంటివి? నీనే మహారాజ ననియా?

వెంగ—(క్రోధముతో లేచి రాయబారి దిక్కు మొగంబై) ఓరోరీ! యసత్యవాదీ! సత్యసంధుండయిన మహారాజుకడ నిట్లసత్యముగాం బ్రేలితి వేమిరా? (దుష్టుండ వీవను వెనుకటివిద్యముచదువుచు కత్తిదూసికొని పై కురుకుచున్నాడు)

వర—హా! హా! శాంతింపుము, శాంతింపుము (అని యడ్డు వడుచున్నాడు)

రంగ—వత్సా! శాంతింపుము, ఈమాట కేమి గాని వీనికడ నున్న నా జాబు నీ వేల లాగికొని చదివితివి? వీని నేల నడచితివి?

వెంగ—(చేతులు జోడించుకొని వినయంబుతో)

మ. అది తప్పు క్షమింపు మో నరవరే ♦ న్ద్రా! వీడు కాళింగరా
ట్పదమందుండెను రాయబారినని చెప్పన్ వాయియొత్తంగ నా
హృదయంబుం దలరాదు భూధవునిపై రేకెత్తి యున్నట్టి క్రో
ధదశన్ గ్రిందుమిాదుం గానక యస ♦ త్కార్యంబుగావించితిన్.

రంగా—గీ. రాజుపైం గల కోపంబు ♦ రాయబారి
మీాదం జూపుట యుచితమే ♦ భూవయితుల
కితండు చేసిన తప్పేమి? ♦ యితని నడవ
నేటి కవివేక మది యని ♦ తేట పడదె?

వెంగ—(తల వాల్చి భయ మభినయించుచున్నాడు)

రంగా—వత్సా! కడచినదానికిఁ గళవళంపడకుము. విజయరామ రాజేమి వ్రాసెనో చూత మా జాబిటు తెమ్ము.

వెంగ—(భయసంభ్రమంబు లభినయించుచున్నాఁడు)

నర—మన వెంగళరాయఁ డా రాజుమీఁదికోపంబునందానిఁ దునా తునకలు గావించెనఁట. మహారాజా! తప్పుసైచి కాచి రక్షింపుము.

రంగా—అయ్యయ్యో! యెంతప్రమాదము సంభవించినది? కాని దాని విశేషము చదివియుండును గావున నందలివిశేషము లేమిదో?

నర—"గోలుకొండనుండి బుస్సీ సపరివారుండై హైదరుజంగుతో జమాబందీవచ్చి రాజమహేంద్రవరమునం దున్నవాఁడు కావున మనము మనపూర్వ వైరమును మాని చతురంగబల సమేతులమై పోయి పన్ను గట్టలేమని చెప్పుదము. దానికి వారొప్పకున్నఁ జేయ వలసిన పని చేసివత్తము" అని.

రంగా—(తనలో) అవురా! ఎంత తంత్రవాదియో విజయ రామరాజు! (ప్రకాశముగా) మంత్రివర్యా! వీనికిఁ దగినట్లు చెప్పి యంపి పుచ్చుము.

నర—(దూతదిక్కు మొగంబై)ఓయీ! మా వెంగళరాయండన్న చాటువాఁడు. వాని చేతలకు నీవు చింతింపకుము. మీరాజుతో—

శా. మాపై నింత కృపారసం బొదవుటన్ ♦ మాకెంతొ సంతోషమై
మీపట్లన్ గురుభావ మొంచితి మెడన్ ♦ మీ చెప్పి నట్లేము మీ
ప్రాపై పోవుటయే తలం పయిన మా ♦ రాజానుజోద్వాహ మీ
మా పేగావున మిమ్ముఁగూడమికి లో♦మన్నింప నోమాపయిన్,
(అని మా మాటగాఁ జెప్పుము)

వెంగ—(దూతం జూచి)

క. ప్రహరింపఁబడితివారల, సహాయశూరులుత్వదీయ♦సాహాయ్యంబున్
గ్రహియించువారుగారరి, గహనపరాక్రములునిన్ను♦ గణియింపరె
అని నామాటగాఁ జెప్పుము [దన్.

రంగా—(తమ్ముని వారించి) రాయశాస్త్రీ!

మాలి. "పడుచుతనంపు మాటల్ ♦ పాటి సేయంగ నేలా
నడుము నడుము మీ భూ ♦ నాథుతో రావుబారల్
కడిమిఁ గలిగి యున్నం ♦ గార్యవాదుల్ సుమీ సా
నుడులు హితము లంచున్ ♦ నుడ్వి కైకొనఁ గానీ.

అని నామాటగాఁ జెప్పుము.

రాయ—చిత్తము మహారాజా! సెలవొందుచున్నాను, పోయివచ్చె
దను. (నిష్క్రమించుచున్నాఁడు)

రంగా—వయస్యా! ఏమి విజయరాముని మోసకృత్యము!
బుస్సీ యొద్దకుఁ దానే పోయి మొఱ్ఱపెట్టుకొనరాదా! మనతో జేల!

నర—తోఁడునుగాదు గీడునుగాదు. మనము చతురంగబలము
లతో నటకుఁ బోయిన నేదో తంత్రంబు పన్ని బొబ్బిలివారు సిపాయి
యుద్ధమునకువచ్చిరని వారికిఁ బురిఁగొల్పి వారిచే మనమచ్చు మాపు
టకే వారిసంకల్పము.

రంగా—దానికేమిగాని గోలకొండసర్కారున కీబుస్సీ యెవఁడు?
హైదరుజంగున కేమియుద్యోగము?

నర—నవాబు సాలబజంగు పరాసుల సంరక్షణముంగోరి వారి
ప్రతినిధి యగు బుస్సీదొర కీనడుమఁ గొంత దేశం బొసంగినాఁడు.
మున్ను ముజఫర్జంగు డూప్లేకొసంగిన దేశముతో నిప్పుడు గుండ్ల
కమ్మ మొదలగు జగన్నాథమువఱకుండు దేశమంతయుఁ బరాసుల
వశమయ్యెఁ గావున బుస్సీమనకు సర్వాధికారియై యున్నాఁడు.
హైదరుజంగు వానికి మంత్రియై వచ్చినాఁడు.

రంగా—సరే మంత్రివర్యా! రాజమహేంద్రవరమునుండి మనకుం
దాఖీదులు వచ్చినవిగదా! మనము పోకుండుటకు వారికేమే నాగ్ర
హము వచ్చునేమో? వారికి వచ్చినను రాకున్నను శనిగ్రహమువలె

నున్న రామరా జాగ్రహమును బుట్టింపక మానఁడు. దీని కేమి యాలోచనము? నేను బోయివత్తునా!

నర—రాజా! ఎల్లి మన వెంగళరాయనికిఁ బాణిగ్రహణోత్సవము చేయ నిశ్చయించుకొని యుంటిమిగదా! ఇట్టిచోఁ దండ్రివంటి నీవేగిన నుత్సవం బెట్లగును? నీవు లేకున్న నెవరు కర్తలు, ఎవరు స్మర్తలు?

రంగా—వయస్యాగ్రణీ!

ఉ. తమ్మునిపెండ్లివైభవవి ♦ ధానము సల్పక పోవరాదు, దే
శమ్మున కాధ్యుఁడైన బుసి ♦ శాసనముం గడిదాటరాదు, ము
ఖ్యమ్ములు రెండుకార్యములు ♦ నారయ నొక్కటతిం దటస్థమై
నెమ్మది నూఁపుచుండెడిని ♦ నిల్వఁగ నెద్దియుఁ గాదిదెట్లొకో?

ఏది యెట్లయినను నేను బుస్సీ దర్శనంబునకుఁ బోవుటయే శ్రేయమని తోఁచుచున్నయది.

నర—రాజా! నాకట్లు తోఁప దేమంటి వేని వినుము. విజయరామరాజున కా హైదరు చాల మఖ్యుఁడయి యున్నాఁడని దెలియవచ్చుచున్నది. విశేషించి యిపుడు మనవిరోధి తనమాట నుల్లంఘించి తనదూతం బరాభవించితి మని డెందంబున నతం డెంతయేని మండిపడుచుండును. ఆతం డతనికి లంచ మిచ్చియైన బుస్సికి బోధించి మన కవమానంబు చేయించుట సిద్ధము.

వెంగ—(కోపముతోఁ గత్తి జళిపించుచు,)

మ. అవమానం బొకఁ డౌన రావుకులదు ♦ ర్గాబ్ధిందుఁ డౌ తేనికిన్
యవనుండున్ గవనుండు వానితలపై ♦ నౌ వాఁడున్ లెక్కయే
భువనంబుల్ భువనాధినాథులును సం ♦ పూర్ణస్థితింగూడి రా
నవలీలం బ్రసరేణురూపములు గా ♦ నాలంబునన్ రాయఁడే.

బుస్సీ భయంబును గిస్సీ భయంబును మాపంగడంబున లేనిమాటయే నిక్కంబు. కాని కార్యాంతరవ్యగ్రత మన మహారాజుం గలగించు

చున్నయది. నాకిపు డీకళ్యాణం బైన నేమి కాకున్న నేమి? ఇతఁడతఁ డటఁబోకున్న వాఁడు మనపై దాడి వెడలుదుఁడు అదియే నాకుఁ గళ్యాణంబు (కత్తిసవరించుచు బిరికించి) అదిగో, యెవ్వఁడో చారుఁడు తత్తరపాటుతో వచ్చుచున్నాఁడు. వాఁడు పోఁడనకు వచ్చునట్లే నా మదికిం బొడగట్టుచున్నది.

[అందఱు చూచుచున్నారు. అంతనొక చారుఁడు ప్రవేశించుచున్నాఁడు]

చారు—జయము జయము. మహారాజ (వంగి నమస్కరించుచున్నాఁడు)

నర—ఎవఁడురా నీవు? ఏమి వృత్తాంతము?

చారు—అయ్యా! నే నేలినవారి దాసుఁడను దేవరవారితో మనవి చేసుకో వచ్చినాను.

నర—చెప్పుము. విజయరామరాజు మనపై దండెత్తి వచ్చుచున్నాఁడా యేమి?

చారు—వానిమొగము! మనపై వాఁ డెక్కడ దండెత్తగలఁడు సామీ? కానీ పరాసులబూసి హైదరుసాహేబుతో నన కాపల్లికివచ్చినాఁడంట. ఇతఁ డాడకుంబోయి నర కాకుతాకీదు మనము గురి సేసి నాము కామనిమనపై నేరాలు చెప్పి హైదరుసాహేబునకుఁ బన్నెండు లచ్చలు లంచ మిచ్చి వానిచే బూసికిఁ బోరు ముట్టసేసి మన బొబ్బిలి గడీని ముట్టడింప వచ్చుచున్నారంట బాబూ!

వెంగ—సరే! సంతోషము. నీవు పోయి మన బలగంబులకెల్ల నిది తెల్పి పురికొల్పుచుండుము.

చారు—(నిష్క్రమించుచున్నాఁడు)

రంగా—మామా! యేమి యాలోచనము?

నర—రాజా! అధైర్యపడకుము.

రంగా—(బొడుగఱచి మీసము మెలివెట్టుచు) మంత్రిపుంగవా!

శా. ధైర్యస్థైర్యహిమాద్రు లీ వెలమ స ♦ద్వంశప్రభూతప్రభుల్
శౌర్యౌదార్యగరిష్ఠులందుఁ బ్రబలుల్ ♦ మా రావువా రట్టినే
వీర్యం బేఁగ నధైర్యము బడుదునే ♦ వీంద్రా త్రిలోకంబు లా
దార్యోగ్రప్రభ నెత్తివచ్చినను దో ♦ ర్దర్పస్థితిన్ జూపనే.

అది యట్లులైనను మునుమున్న మనమే దండోపాయంబునకుం గడంగుట రాజనీతిపథంబుగాదు. కావున సామదానాదుల మన మాపరాసులతేనిం బరమాప్తునిగాఁ జేసికొనుటయే పాడి.

నర—రాజాగ్రణీ! నీమాట యుక్తియుక్తముగా నున్నది. కాని శత్రురాజ ప్రబోధితుం డగు బుస్సీ మనసాయం బిస్సీయనిన నసుం గావున మనకుఁ బరమమిత్రుండును సకలపరాసు సేనాధ్యక్షుండును నగు గోలుకొండార కీవృత్తాంతంబెఱింగించి తన్మార్గమున వీని ప్రాపొం దుట మంచిదని నా యభిప్రాయము.

రంగా—ఆహా! మిక్కిలి చక్కఁగా జ్ఞప్తికిం దెచ్చితివి. ఆగోలుం డార మున్న మనకును విజయనగరమువారికినిం గల వివాదముదీర్చి మనపై దయఁ జూపినవాఁడు ఇట్టిచో మన కీ యుపకారము సేయక మానఁడు. కావున బృందావనపురంబున కిపుఁ డొక రాయబారిం బుచ్చుము.

నర—చిత్తము ఎవఁడురా! అక్కడ?

దౌవారికుఁడు—(ప్రవేశించి) జయము, జయము మహారాజ! యెవరో యిద్దరు తురకహరకాలాలు వచ్చియున్నారు.

నర—వారిం బ్రవేశపెట్టుము. ఈజాబుఁ గొనిపోయి మంతెన బుచ్చన్న కిమ్ము. (జాబువ్రాసి యిచ్చుచున్నాఁడు)

దౌవా—చిత్తము. (నిష్క్రమించుచున్నాడు)

హరకాలాలు—(ప్రవేశించి) మహారాజ్ కీ సలాం. వజీర్ సాహే బుకీ సలాం.

నర—మీరెవరు? ఎక్కడనుండి వచ్చుచున్నారు? ఏమి పని నిమిత్త మిట వచ్చినారు?

హ—రాజాసాహెబ్! మేం బూసికాహుజూర్ నౌఖర్లంమియా! అన్కాపల్లీసే మహారాజుకుసర్కార్హాహుకుం తెచ్చినాం సాహెబ్.

(అని ఫరమానాపత్రిక నిచ్చుచున్నారు)

నర—(పత్రికం గ్రహించి) మేము మీకు విశేషబహుమానము చేసెదము. మాకీమాత్ర ముపకారము చేయఁగలరా?

హర—మే మేం సేయవాలా బోలో మహారాజ్!

నర—మఱి యేమియుంగాదు. కొన్ని మాటలడిగెదము. వానికి నిజమైన యుత్తరములు చెప్పుడు.

హరి—సిత్తం. సిత్తం. హాజర్.

నర—విజయరామరా జిపు డెక్కడ నున్నాఁడో, ఏమి చేయుచున్నాఁడో చెప్పఁగలరా?

హర—సిత్తం. సిత్తం. విజయరాజా! హమారాలక్కా ర్మేబుస్సీకు మిలాఖత్ హైదరుజంగు సే, బహుత్ మిలాఖత్ వున్నాఁడు భాయ్ వాడికీ వాఁడు బారాలచ్చా బారీలంచా మిచ్చినాడ్ మియా?

నర—మావిషయమై వా రేమనుకొందురో చెప్పఁగలరా?

హర—క్యాఫాయిదాహుజూర్! హమారా హైదరుజంగుబద్మాష్ వున్నాఁడు. మహారాజ్! మీకీ మార్నేకు వస్తాము భాయ్!

నర—సరే మా యదృష్టమెట్లో యట్లు జరుగును మీరుపొండు.

(అని బహుమతు లిచ్చుచున్నాఁడు)

హర—(సలాములుచేసి నిష్క్రమించుచున్నారు.)

రంగా—మంత్రివరా! మన ప్రయత్నము లన్నియు నిట్లుగాఁ బరిణమించు చున్నవి? వివాహోత్సవంబున కంతరాయంబుగా రాజాధముం డెంత తంత్రంబు పన్నినాఁడో? మన రాయబారి

పోయినను వానిని వాడు సరకుగొనువాడు కాడు ఇప్పటి సందర్భములం బట్టి చూచిన యుద్ధమగుననియే తోచుచున్నది.

వెంగ—(తనలో) ఇది నాకుఁ బెండ్లివలెనే యున్నది.

రంగా—మూర్ఖజనబోధితులగు నామూర్ఖులు మన మేమిచెప్పినను జెడచెవిం బెట్టుదురు. అనేక శతశతఘ్నీకాభిరక్షితశత్రుమహాసైన్యంబుతోఁ గతిపయసేనాపరివృతులము మన మెట్లోఁపగలమో తోఁపకున్నయది. ఏదియెట్లు కాఁదలఁచుకొనెనో దానికి దైవంబే ప్రమాణంబు. (ఆలోచించి) మన పాపారాయఁ డెక్కడ ?

వెంగ—ఆర్యా ! సంకోచింపకుము.

క. వీడుఁడు పాపారాయఁడు, భూరమణుని తమ్ముఁడితఁడు♦ పోరునఁబడినం దోరణగ్రుచ్చినమచ్చున, వైరులమెయిఁగ్రుచ్చుకుండ్ర♦ బారీలెలకున్

(తెరలో)

శా. కాపేయంబు నధర్మముం గొననివేం ♦ గళ్లాయువీడుండుదా బ్రాపై సంగడికాఁడునై నిలువనుం ♦ గ్రక్రూరజన్యంబునం బాపారాయఁడు బాఁదటీలెఁగొని ద ♦ ర్పంబొప్పముక్కంటినాఁ జేపెట్టుఁగనుపించి మజ్జగము భ ♦ స్మీభూతముం జేయఁడే.

[అని చదువుచుండ కత్తిదూసికొని పాపారాయడు ప్రవేశించుచున్నాడు]

మ. కరవాలంబున నట్టులుం దలలు వే ♦ ర్గాలేచి తారల్ బలెన్ సురవర్త్మంబున నాడి తాళఫలముల్ ♦ జోకం బడుంజొప్పునన్ ధరమీఁద బడి బంతులట్ల కడిమిన్ ♦ దాటంగఁ బూటంబుగా నరిసేనం దరలింతు రండు నను డా ♦ యం జాలువా రుండినన్.

(అని కత్తిదూసికొని పరవళ్ళఁ ద్రొక్కుచున్నాఁడు)

రంగా—బావా! నీవెంతకైన సాహసుఁడవే కాని యిది యరిసేన గాదు. కన్నుదెఱచి మమ్ము నీవారిం దేరిపాఱఁ జూడుము. క్రోధం బుపసంహరించి యిఁకమ విశ్రమింపుము. (పీఠముం జూపుచున్నాఁడు)

పాపా—(శాంతించి) జయము జయము మహారాజా! వైరుల సంహరింతు నను మన వేంగళ్రాయని మాట విని నిజముగా వైరులే యని భ్రమపడి క్రోధతామ్రాక్షుఁడనై వచ్చితిని. రాజాధిరాజ! నా ప్రమాదంబునకుఁ బ్రభువు లాగ్రహింపకుందురు గాక (కూరుచుండును)

రంగా—బావా! శత్రువాక్యంబు విన్నంతనే నీకింత క్రోధంబు వచ్చి యిట్లయితివి. మఱి శత్రుదర్శనం బైన నెట్లగుదువో కదా!

వెంగ—తే. మృత్యుదర్శనమైన నీ ♦ మేటి మగఁడు
జంకు డొంకు నెఱుఁగఁడా ♦ శత్రుదర్శ
నం బదేపాటి తలఁపఁ దృ ♦ ణంబుగా మ
నంబునం దెంచి పొంగుఁ బ ♦ బ్బంబటంచు.

నర—బళిరే! మన పాపారాయఁడా?

క. పెండ్లికిఁ బోయిన సదువున
గొండ్లి యొనర్చుచును గలన ♦ కుం బోయి యితం
డిండ్లరయ నీక పగతుర
పెండ్లాముల త్రాళ్ళఁ ద్రెంచుఁ ♦ బెట పెట మనఁగన్.

రంగా—పాపరాయా! నీ పాపగ నెలలకుం బాపరాయండ వనుట కింతయు సందియంబు లేదు. నీ ప్రాపునం జేసి మా కెన్నఁటికి నపజయంబు రానేరదు. కాని విజయరామమూర్తి—(అర్ధోక్తియందు)

పాపా—(ఆగ్రహముతో) హాఁ! మహాపాతకవర్తి విజయరామమూర్తిం బెద్దచేసి కీర్తించెద వేమి? (సంభ్రమంబున లేచి) వానినిప్పుడీ చంద్రహాసంబునకు బలి యిచ్చి వత్తు నాజ్ఞ యిమ్ము.

రంగా—పురుషసింహా! శాంతింపుము. నామాట సాంతముగా వినుము. విజయరామనరేంద్రుండు సపరివారుండై రాజమహేంద్రవరంబుకడ హైదరుజంగుతో నెయ్యకోలు సేసి యిచ్చకంబులాడి వానికిఁ బండ్రెండులక్షల రూప్యములు లంచమిచ్చి తత్సాహాయ్య

బున బుస్సీయనుగ్రహంబు వడసి వానికడ మన లేనితప్పులెల్లం జెప్పి
కొలుపించి వాండ్రతోఁగూడ మనమీఁదికి దాడివచ్చుచున్నాఁడని
వార్త వచ్చినది. అనేక శతఘ్నికాభిరక్షితంబగు నప్పరాసు
సైన్యంబుతోఁ గతిపయసేనాసహాయుల మగు మన మెట్లోపఁ
గలమో కార్యం బేదియో వచింపుము.

పాపా—(అలక్ష్యం బభినయించును)

శా. హాఁసీ! యెంతటి దుస్తరంపు ప్రళయం ♦ బోకాని కానిమ్ము హా
నీసేనాధికవిక్రమక్రమముల ♦ న్నీ వెన్న లేకుంటి వా
మూసాబూసిశతఘ్నులం బహుబలం ♦ బుల్నీవు కన్నెత్తినన్
ద్రాసం బొంది నశింపవే పవి మహా ♦ గ్రావంబులం గూల్పదే?

మహారాజా! వారెన్ని వేలున్నను నీకాల్బలంబులో నొక్కనికిం
జాలిరారుసుమీ! ఇది నిక్కంబు.

ఉ. బుస్సియు హైదరు న్విజయ ♦ భూపతి వచ్చిన నేమి లెక్క వా
రిస్సిరో! కాలకాలుఁడు మ ♦ హేశ్వరుఁ డాత్రిపురారి వచ్చినన్
గస్సని తేచుత్రాఁచువలె ♦ నాకరవాలము నాట్యమాడదే
దుస్సహమే రణంబు వగ ♦ దోఁగకు మింకిట రాజచంద్రమా.

వెంగ—బళిభళీ? బళిబళీ?

నర—రాజా! మనపాపారాయఁ డెంతయైనం జేయఁగలవాఁ
డిందుల కింతయును గొంతలేదిది యంతయుఁ నిక్కంబు సంగ్రా
మంబు సంభవించు నని మనకింతయుఁ జింతింపవలసినపని లేదు. అయి
నను మనము జాగరూకులమై యుండవలసిన వారము. కావున నా
ముక్కుడుల మన పాలంబు ద్రొక్కనీకుండఁ జేయుట మొదటఁ
జేయవలసిన పనియై యున్నది.

రంగా—మామా! నీచెప్పినది యుక్తియుక్తముగానున్నది. దానికి
మనలో నెవ్వరు సమర్థులో? (పాపారాయని దిలకించుచున్నాఁడు)

పాపా—రాజా ! దీనికింతయేల ? నేను సర్వమునకు సంసిద్ధుఁడనై యున్నవాఁడనే. కతిపయసేనాసహితుండనై యిపుడు పోయి వైరులు వచ్చుమార్గంబున మనయెల్ల రాజాముకడకుం గాచికొనియుండి వారినడ్డగించెద. ఒండొకొండైన భండనంబు గావించి చించి చెండాడెద నాజ్ఞ యొసంగుము. పోయివచ్చెద. (అని లేచుచున్నాఁడు)

రంగా—అసహాయశూరుఁడవు నీకుం జెప్పవలసిన దేమియు లేదు, గాని పోరం దారతమ్యంబు లెఱింగి మెలంగుము. పోయి రమ్ము.

పాపా—చిత్తము (అని నిష్క్రమించుచున్నాఁడు)

రంగా—అమాత్యశేఖరా! మనపాపారాయండు పోయిన శత్రువుల మన పొలంబునం దడుగు పెట్టనీయం డనియే నానిశ్చయము. కావున మన మెల్లి పెండ్లిం బ్రయత్నములు జేసికొందమా ?

నర—వివాహోత్సవము నిరాటంకముగాఁ జేసికొనుట కేమియును సందేహము లేదు. అయినను మన మేమఱియుండరాదు, ఒక కన్నుమాత్ర మటు వేసియే యుండవలెను. విజయరామరాజనేక కుమార్గంబు లెఱింగినవాఁడు, ఏదారి నెట్లు సేనలం దెచ్చి యెట్లు చేయునో ? మన కెంత యిక్కట్టుపడవలసి వచ్చునో ?

రంగా—అదినిజమే. ఆతం డెంతకైనం జాలినవాఁడు. మనము జాగరూకులమై యుండియే ప్రవర్తింతము. మంత్రివర్యా ! నీవు వైవాహిక సంభారంబు లెల్ల సమకట్టింపుము. వెంగళరాయా ! నీవు నాతో రమ్ము. మనము స్వయముగాఁ బోయి సేనలం బురికొల్పి వత్తము.

అందఱు—(లేచి నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము

---

శ్రీ

# బొబ్బిలియుద్ధము



## ద్వితీయాంకము



స్థలము : దేవులపల్లి చెంత డేరా.

[అంత హుక్కాత్రాగుచు నాసీనుఁడగు హైదరుజంగును, వినమ్రుఁడై విజయరామరాజును ప్రవేశించుచున్నారు.]

హై — క్యా భాయ్! నీకి యింతా ఫికర్!

విజ — సర్కారువారితో నాభయ మేమని చెప్పుకొందును?

మ. వెలమల్ క్రొవ్వులు తెప్పవచ్చి పడి నా ♦ పీఠంబు వోఁగట్టి బా
ములపాల్సేయుదురో యటంచు ననిశం ♦ బుక్ దల్లడంబందగుం
జెలు ప్రాణం బఱచేతఁ బట్టుకొనియే ♦ డిల్లవడ్డ చిత్తంబుతోఁ
బొలుపేదన్ నిల నైతిఁ గాని సుఖమే ♦ ఫుక్ లేశః పోయెంగదా

బొబ్బిలివారిలోఁ బాపారాయఁడును. వేంగళరాయఁడు నతిక్రూరులు, వారు నన్నును నారాజధానిని తృణప్రాయముగాఁ జూచుచుందురు. రంగారాయఁడును వారాడినదాట, పాడినదిపాటగా, జూచుచుండును గాని మాఱాడువాఁడు కాఁడు. ఇప్పటికైన వారి యభిప్రాయము లెట్లున్నవో చూత మని మొన్న నేనొకదూతం బుచ్చితిని. వాఁడు వారికడకుం బోయి "బుస్సియును హైదరుజంగుసాహేబును జతురంగ బలసమేతంబుగా జమాబందీకి వచ్చియున్నారు. మనము వారి నెదుర్కోలు చేసి బహూకరింతము రమ్ము" అని నేఁ జెప్పినట్లు చెప్పెనట! చెప్పినంతలో బుస్సియెవఁడు హైదరెవండు మమ్ము రమ్మనుట కా విజయరాముం డెవం డని నిరసించి వానిం బట్టి చావఁగొట్టిరఁట

హా! హా! సాహెబేంద్రా! నాకు మిక్కిలి యవమానంబు గలిగినది గదా. రావువారికి మీరాధికారు లున్నారను మాటయైన లేదు మీ కిదివఱకే బొమ్మగట్టినాడు సరిగదా, సమయము వచ్చినప్పుడు పిండి పెట్టండలంచి కూడ యున్నారు. యవనేశ్వరా! వారిపట్ల నేనెంతయు ననమర్థుండ నన్నట్లు రక్షింతువో భారమంతయు మీమీఁదనే వేసి యున్నాఁడను ఇంక దేవర చిత్తము నాభాగ్యము

హైద—(హుక్కాపీల్చుచు) రాజా హమాకీ వారో హాలచ్చం సేస్తారా? యేమిటీ మాటా సెప్తావు? మాకీ హింతా నమ్మకం లేద్. మాభలంవార్కి తెల్వగా హో. నీకీ ఫర్వాహీ వుండుభాయ్!

విజ—ఖాన్ వర్యా!

గీ. ఎంత చెప్పినఁ గాని నా ♦ స్వాంతమందుఁ
గుదురుబా టింతయును లేక ♦ కుందు మన
బలగము ఫిఱంగు లొకయెత్తు ♦ పాపరాయఁ
డొక్కఁడె త్రెట్లోకో వారి ♦ నుక్కడంప.

హైద—మాకీ మించి వాగీకి జబర్దస్తీ క్యా భాయ్! నీకి హింతా భయం లేద్ సంసయం లేద్ మేమూ దేశాలన్నీ గెల్చినామ్. నీకీ తెల్వాదూ వుంది. మాకీ సూస్తే ముల్కూల్ ముల్కూల్ గడగడా గడగడా వడుకుతాయిభాయ్. బొబ్బిలీ గిబ్బిలీ లచ్చంలేనిదీ మాటా సెప్పి ఫాయిదా వున్నదీ లేద్. ఖైర్! బొబ్బిల్కా తారీఫ్ క్యారాజా?

విజ—తురుష్కవంశాగ్రణీ! మీ రంతటి బలపరాక్రమవంతులే యనుట కింతయును సందేహము లేదు. కాని బొబ్బిలిపక్షనాయకుల శౌర్యం బనివార్యం బాకర్ణింపుము.

ఉ. గిబ్బవజీరు ముమ్మొనలఁ ♦ గేరాడువాలున కైనఁ గానలో
బెబ్బులికోఱకైనఁ గను ♦ పించెదు నించుక వాడి వీడుటల్
బొబ్బిలిపీటికోట నడిఁ ♦ బుట్టినదో మయు వాడిపోడిమిన్
గొబ్బున మత్తవారణముఁ ♦ గోల్చలి సేసెదుఁ బట్టి నేట్టనన్.

హైద—ఖైద్ బొబ్బిల్గడీమే కైసా బందోబస్తువున్నాదీ? కెత్నా లష్కర్ భాయ్!

విజ—

శా. బాబో! బొబ్బిలికోటకొమ్మల నరా బాగా ♦ నయస్తంభముల్
రాఁ బో సీఁగకుఁ జోటు లేనటుల ని ♦ ల్వంజేసి నల్చక్కి మేల్
డాబాలన్ బురుజుల్ శిలాఫలకముల్ ♦ సంధించి నిర్వించి బం
దోబస్తై చనఁ జేసి రందు బలముం ♦ డు న్వేన వే లెప్పుడున్.

హైద—అచ్ఛా! రాజా! వారికీ బహూత్తారీఫు చెప్తావు. వారీమే యెంత వస్తాదు ల్వున్నాది సెప్పొ మియా!

విజ—సాహేబేంద్రా! వారందఱును సిస్తుగల వస్తాదులే వినుము.

సీ. గాండ్రు గాండ్రనుచును ♦ దీండ్రించు క్రోల్పులి
తాండ్రపాపారాయ ♦ ధరణివిభుఁడు
తోఁకఁ ద్రొక్కిన లేచి ♦ వీఁకఁ జూపెడుకోడెఁ
త్రాఁచు వేంగళరాయ ♦ రాజవరుఁడు
వడి బొబ్బరించు క్రొ ♦ వ్వాడిసింహం బిను
గంటి నృసింహరా ♦ డ్ఘనయశుండు
సరభసంబున దాటు ♦ శరభంబు దామెర
ధర్మరాయాభిఖ్యు ♦ కర్మఠుండు

తే. మరియుఁ జెలికాని వేంకయ ♦ మంతెనాన్వ
వాయబుచ్చెన్న కాకర్ల ♦ వంశ వేంక
టాఖ్యుఁడును గోత్రవిఖ్యాతి ♦ నలరుయోధు
లోహటింపరు ఘోరాజి ♦ సాహెబేంద్ర.

శా. రంగారాయఁడభంగసంగరమహా ♦ రంగప్రదేశంబునన్
రంగత్పూతనిశాతహేతిఁ గొని శౌ ♦ ర్యస్థైర్యమంథాద్రియై

గింగు ఱ్వట్టఁగ మొట్టిన స్మశఫిరం ♦ గిలు స్ఫురంగిలునున్
భంగం బందుట కేమి లెక్క మఱి భూ ♦ భాగంబులల్లాడఁగన్.

హై—రాజా! బలేవస్తాదు వున్నావు! నీకీ బడాలష్కరువున్నదీ విన్నాము. లడాయికీ యింత హడలీ పోతావు. ఫరవాలేదు. వార్కి నీవుపోయీ యుద్ధం సైలోయ్!

విజ—అంతభాగ్యమే నాకున్నచో నేనింత చింతింప వలసిన పని యేమి? దేవరా! బలపరాక్రమహీనుండను గనుక నే మీమీసాయము నపేక్షింపవలసివచ్చినది. లేకున్న వారివలె నే నేనును మీాఫరవానా పాటింపకే యుందును.

హైద—(ఆగ్రహముతో) హరే రే! మాఫర్వానాకురద్దు చెప్పిస్తాడు. వాడ్కి యిప్డేలడాయి పెడ్తాన్. గోరీకడ్తాన్ దేఖో. (హుక్కాగొట్టముం బాఱవైచి) కోన్ రే! లాడూఖాన్! లాసూఖాన్! హుసనల్లీఖాన్! జాసూఖాన్! మహమ్మదుస్సేన్! సిద్దీబిలాల్! జల్దీ జల్దీ లడాయికీ తయార్. (లేచి కోపముతోఁ గేకలు వేయుచున్నాఁడు.)

భటుఁడు—(ప్రవేశించి) సర్కార్! బుస్సీసాహేబ్ కాసవారీ ఆతీహై.

[అంత నంగరక్షకులతో బుస్సీ ప్రవేశించుచున్నాఁడు]

అందఱు—(సలాములు చేయుచున్నారు)

బుస్సీ—సలాం. సలాం. (అగ్రాసన మధిష్ఠించుచున్నాఁడు)

అందఱు— ఆసీను లగుచున్నారు.

బుస్సీ—హైదరుజంగ్! అనకాపల్లినుండి మనముvrాసిన రెండవ తాఖీదునకైన బొబ్బిలిరాజువచ్చి పైక మిచ్చినాఁడా? లేదా?

హైద—సర్కార్! వాడికీ థరేమిహుజూర్! మనలచ్చెంవాడీకీ నై. మనకీ మార్నేకు తయ్యారు వున్నాఁడు, విన్నాన్.

---

బుస్సీ చెప్పినమాట లన్నియు నస్యదేశ భాషాస్వరములతో నీ పుస్తకమం దున్నట్లు గాని సమయానుకూలముగ నించుక మార్చి కాని ప్రదర్శింపవచ్చును.

బుస్సీ—ఇది నిశ్చయమా ? ఎవరు చెప్పినారు ?

హైద—నిశ్చయం, నిశ్చయం. హాం విజయరాంరాజాబోలీనాడు సర్కార్ !

బుస్సీ—(విజయరామరాజుం జూచి) ఏమివృత్తాంతము ?

విజ—సకలభువనేశ్వర ! నేను దేవరకార్యార్థమునకా పల్లికివచ్చుచు వారియుద్యమ మెట్లున్నదో చూతమని బొబ్బిలి కొకదూతం బుచ్చితిని, వాఁడుపోయి—

ఉ. చూసినిఁ జూచి మా ప్రభువు ♦ పోవుచునుండెను మీరు గూడ రా
భాసిలు నంచు నానుడిగఁ ♦ బల్కిన నల్కవహించి వారలా
చూసి యెవండు మే మనిని ♦ పొంతకుఁ బోఁ బనియేమటంచునో
నేసినవాఁడు వచ్చి వచి ♦ యించెను వారిసమీకయత్నమున్.

హైద—మాదర్శనానికి వాడూ రాలేదు నిజం ఉందిహి దేమాకి దాఖలా సెప్తాదీ. నీకీ దూతా సెప్పా నేమిటీవోయ్.

బుస్సీ—పాపారాయఁడు మహాశూరుఁడనివినియుంటిమి. మనము బొబ్బిలి గెలువలేము. జమాబందీ మాని మఱలిపోవుదము లెండు

విజ—(దిగులొంది తనలో)

పంచ. ప్రమాదమే తటస్థమయ్యె ♦ వారు కోటలో మహా
సమీకయత్నముంబొనర్పఁ ♦ జాగిరంచుఁ జెప్పుటన్
క్రమంబు లేకితండు పోరు ♦ కాదటంచుఁ బోవ దే
శమేను వీఁగి జోగినై భ్ర ♦ శంబుఁ గుందనోఁ జుమీ,

అయిన నిట్లు చెప్పెదంగాక; (ప్రకాశముగా) పరాసువంశతిలకా !

మ. ఇపు డాపాపడు లేఁడు వీట మన మి ♦ ట్లేతెంచుటల్ వించు దా
నుపరోధింపఁగ మార్గమధ్యమునకై ♦ యున్నట్టి రాజాముకున్
గృపణుం డాతఁడు సేనతోఁ జనియె నీ ♦ కీ తెంచియే నేను మి
మ్మపమార్గంబున నీడఁ దెచ్చితిని లే ♦ దావంతయుం జింతిలన్,

ఇట్టిచో మనమా బొబ్బిలిగడీ ముట్టడించి జయించుట సులభసాధ్యంబు. మన ఫిరంగి యొకటి ప్రేలిన జనినంతనే కోటయుం బెటిల్లుమని ప్రేలగలదు. రావువారి పంచసహస్రపరిమితం బయిన స్వల్పసైన్యంబును మనమహాసైన్యంబు గెలుచుట మర్లభంబులోనిదిగాదు.

క. దేవర వారీ బొబ్బిలి, సేవకవశంగఁ జేసికొనఁగ నేరనిచో నిం

కేవారు మీకు వశులై, భావింతురు పన్నుగట్టి వారే ప్రభువుల్

అలంతులగు బొబ్బిలివారినే మీరు వశముచేసికొన లేకున్నచో మీకు మఱి యెవ్వరు వశులగుదురు ?

హైద—సర్కార్! బొబ్బిలిగడీ హమారాలాడమాఖాన్ కు ఏకులాడూహై. దీన్కి యింతజడ్వాలా జరూరత్ లేద్. రాజా బోలినట్లు మనయధీకారం సెలాయింపునైయ్తే నామూషీ వున్నాది. బహుత్ నామర్దావున్నాది. నాలీసు వున్నాది నాకు బేరూనీ పేరువున్నాది. హుకుంసే చనంకీ కోటా గూలీపోన్ హుకుం దేవ్. హుకుం దేవ్

సేవకుఁడు—(ప్రవేశించి) సలాంసలాం బందగానేయాలీ! మచిలీబందరుసే హమారా గోరుందొరా కా మర్త్రైన్ ఆయాహై.

బుస్సీ—మర్త్రైను వచ్చినాఁడా? సరే రమ్మని చెప్పుము. (హైదరు దిక్కు మొగమై) కర్తవ్యమాలోచించి చెప్పెదను. నాకు మర్త్రైనుతో మాటలాడవలసియున్నది మీరు (అర్థోక్తియందు)

హైద—హుజూర్! మేం లష్కర్కు హుషార్ సెప్పి వస్తాము సెలవ్వ దేవ్. (అని విజయరామహైదరుజంగులు సేవకుఁడును నిష్క్రమించుచున్నారు.)

మర్త్రైన్—(ప్రవేశించిసలాముచేసి) ప్రభువరా! గోరుందొరగారు మీదర్శనము చేసి మీకీ జాబిమ్మని నాచేతి కిచ్చి పుచ్చినారు.

(అని జాబు నిచ్చుచున్నాఁడు.)

బుస్సీ—(పుచ్చుకొని విప్పి చదువుకొని యాశ్చర్య మభినయించి తనలో ఈ హైదరుజంగెంత మోసగాడు! దుర్మార్గుఁడైన విజయ

రామరాజునొద్ద లక్షలకొలంది లంచము పుచ్చుకొని ధర్మాత్ములు సత్యసంధులైన బొబ్బిలివారిం జెఱపఁ దలంచినాఁడు. నే నేమియు నెఱుంగక వీనిమాయలోఁ బడి నిజముగా బొబ్బిలివారు సర్కారు పన్నుఁ గట్టక యెదిరించిరని వారిమీఁదికి క్రూరాత్ముఁడనై యుద్ధమునకు వచ్చితిని. విజయరామరాజు బొబ్బిలివారిని నాశముచేసి వాని కోట తనస్వాధీనము చేసికొనుటకుఁ జేసిన మోసమిది. ధనముకాశించి హైదరుజంగు పాపమున కొడిగట్టినాఁడు, యిది యిట్టిది గనుక నే నా మిత్రుఁ డాగోవిందొర యిట్లు నాకుఁ దెలియఁజెప్పినాఁడు. కాని వీరినెట్లు చేయవలెనో యట్లు చేసి నే నిటనుండి మరలిపోయెదంగాక! (ప్రకాశముగా) మంచిది నీవు పొమ్ము. తగునట్లు ప్రవర్తింతు నని గోవిందొరతో జెప్పుము. (జాబు వ్రాసి యిచ్చుచున్నాఁడు)

మర్తైను—(జాబు కొని సలాము చేసి నిష్క్రమించుచున్నాఁడు)

[అంత హైదరుజంగును విజయరామరాజును భయముతో బ్రవేశము]

బుస్సీ—(కోప మడంచుకొని) హైదరుజంగ్! బొబ్బిలివారు పన్నుగట్ట లేదని కదా మనము యుద్ధమునకు వచ్చితిమి. వారు మన కీయవలసిన పన్నంతయు నిచ్చివేయుటకు సిద్ధముగా నున్నట్లు తెలిసినది. మన మిపు డేమి చేయవలసి యుండును?

హైద—(భయముతో విజయరామరాజుంజూచి చేయడ్డుపెట్టి రహస్యముగా) రాజా! గోవిందొరా యేమిటీవో రాసీ వున్నాడ్. మన హాలోసనా వీన్కి తెలిసీ వుందీ హేమో? ఖైర్ సీకీఫికర్ లేద్ మియా నేన్ సెప్తాన్ సూడు. ధైర్యం వుంది (ప్రకాశముగా) సర్కార్! వారు బారాపంవచ్చురాల్ పన్నా కట్టకాపోయ్ తాఖీదుల్ రాసీ రాసీ వారు రాకాపోతే యుద్ధంకి వచ్చీనాం మందీ తప్పూనై వుందీ దీన్కి మీహాలోసించవాలా జరూరత్ నై సర్కార్!

బుస్సీ—ఈవిజయరామరాజు మాత్రము పన్నుగట్టుచున్నాఁడా!

హైద—హీతఁడు తనాసేతీకిందవార్ వసూలీకాకపోతే దేషం పండకాపోతే కట్టాలేద్ అని సెప్పుతాఁడు సర్కార్ !

బుస్సీ—వారు కూడ నట్లే యని మన మూహించుకో రాదా ?

హైద—సిత్తం సిత్తం కాని హమూరాతాఖీద్ రద్దూసెప్పి దర్శణాస్కీ రాలేద్. విజయరాజా రాజమంద్రివొచ్చి నాడ్. ఆదాయిస్తాన్ సెప్పి మనివీ సేసూ కున్నాడ్. మనమూ కటాచ్చించీనాం

బుస్సీ—ఇప్పుడు వారీవలసినదే గాక దాని కిబ్బడి యిత్తురఁట. వారినేల కటాక్షింపరాదు ?

విజ—(తనలో) మన సంకల్పము వికల్ప మగునట్టేయున్నది. నే నేమి చేయుదును దైవమా !

ఉ. నేఁటికి నాదుపుణ్యమున ♦ నిత్యవిరోధులు రావువారిచే
పోటుదొలంగు నాబెదరు ♦ పోవును నేన కళింగభూమిలో
బోటరినై మెలంగెదను ♦ బోయని సంతస మందుచుండగా
నేటికి వచ్చుమర్తినిట ♦ కేటికి గోర్దార పుచ్చె నకటా
(భయదుఃఖంబు లభినయించుచున్నాఁడు)

బుస్సీ—(ఆగ్రహముతో) హల్లో! మీరిద్దఱును మహాద్రోహులు. (హైదరుంజూచి) నీకీరాజు లక్షలకొలఁది లంచమిచ్చుటంజేసి యితని మాట విశ్వసించి నీవు నన్ను మోసపుచ్చి యిటకుఁదోడి తెచ్చిబొబ్బిలి వారిం జంపింపఁ దలంచినావు నీవు నాదివానుగా నుండుటకును ఇతఁడీ కళింగ దేశాధీశుఁడుగా నుండుటకునుం దగరు. కానీ ! తొందరపడకుఁడు. మిమ్మెట్లు చేయవలయునో యట్లు చేసెదంగాక.

ఇద్దఱు—(భయ మభినయించుచున్నారు.)

విజ—(గడ గడ వడకుచుఁ దెఱచాటునకుఁ బోయి రూపాయల సంచులఁదెచ్చి బుస్సీయెదుటంబెట్టి) మహాప్రభూ ! నన్నురక్షింపుము.

చ. అరయఁగ మేకవన్నెపులు ♦ లావెలమల్ వయికెంతో మెత్తగా
భెరిమకలాదులలోఁ గని ♦ పింతురు తా రక నైన నగ్గులై

పడులను గాల్చివైతుద ధ్రు ♦ వంబుగ నెన్నఁటికైన నాకునున్
దొరలకు వారిచేష్టితమె ♦ తోఁచెడు నిక్కము విన్నవించితిన్.

క. మనకు ఫరంగిరొకండా, మనుజేశ్వరు డంచునిన్ను మదియింపంగా
మనమున దలచు చునీపయి, గనునై చిరటుంచునీవుగనుగొనవలయున్

శా. ఆగోడుందొర దూరదేశనిలయుం ♦ డవ్వారిదౌర్జన్యమున్
దాఁగన్గో మెటుచాలుఁ దక్కఁబటవా ♦ ర్తాపద్ధతుల్ నమ్మి వా
రాగశ్యూన్యులటంచు నే మొదొరక ♦ న్యాయంబుగా వ్రాసి మా
పైఁగాసిల్లఁగ జేసె నిక్క మెడఁదన్ ♦ భావించి రక్షింపవే.

(తెరలోఁ గలకలము)

బుస్సీ—(నివ్వెరపడి) ఏమో! దీనాలాపములు వినిపించుచున్నవి. రాజా! అది ఏమో?

విజ—

శా. దేవా! యేమని చెప్పనే మగుచు నా ♦ ర్తింగూర్చునో కానిదు
ర్భావుల్ రావుకులీను లెట్టిపనికిన్ ♦ రవ్వంతయుం గొంక రెం
తేపీర్యంబున నుంద్రు నేడు మనవా ♦ రెందే నరణ్యంబునం
బోవం బట్టి వధించి రంచుఁ దెలిసెం ♦ బోనాకు లోకేశ్వరా.

బుస్సీ—హాహా! నిరపరాధులంబట్టి చంపినారా? రావువారు? వారు గోడుందొర వ్రాతలంబట్టి నిరపరాధులు సాధువులనినిర్ణయించితి. సకటా! యెంతక్రూరుడు లెంతపనిచేసినాడు? వారెంతకయినను సమర్థులు. వారిపట్ల నింకఁ గనికరించుట న్యాయంబుగాదు. కానిండు మనవచ్చిన పని తుదముట్టింపుఁడు, ఇంక మీరు మీమీ సేనల సన్నద్ధంబు చేసికొని పోయి కోట ముట్టడింపుఁడు. మీకిదె యాజ్ఞ యిచ్చుచున్నాను.

హైదర్—సర్కార్! హామారామాటా హేలినవార్కి ఇమ్మాకంలేకా మాకీకోపం సేసీనాక్, ఇపుడు తెలిసిహోయిందీవుంది. మేంపోయిచనం లోబొబ్బిలీ నాషణం సేసీ వస్తామ్ సిత్తం హుకుం సర్కార్ హుకుం.

ఇద్దఱు—(సలాముచేసి సంతోషముతో నిష్క్రమించుచున్నారు.)

బుస్సీ—(రూపాయలసంచులం బట్టి చూచి) హా! హా! నేనుబుట్టి యెప్పుడు నిన్నిలక్షలరూపాయలం జూచి యుండలేదు. నాపుణ్యము మంచిది గనుక నాకింత సొమ్మొక్కసారిగా వచ్చినది. బొబ్బిలివారు మంచివారు కాని, కాకపోని నాకు సొమ్మే ప్రధానము. విజయరామరాజు మిక్కిలి మంచివాఁడు, నాకింతసొమ్మిచ్చినాఁడు. బొబ్బిలింగొట్టి వీని కిచ్చుటయే నిశ్చయము. గోరుందొర కేమి తెలియును? ఆతఁడేమి వ్రాసిన నా కేమిభయము? దానిసంగతి తరువాత విచారింతము గాక! (ఇటునటుం బరికించి) ప్యూన్?

జవాన్—(ప్రవేశించి సలాము చేయుచున్నాఁడు.)

బుస్సీ—ఈసంచులం దీసికొనిపోయి నాడేరాలో భద్రము చేసి దుబాసి లక్ష్మన్నం బిలువుము.

జవాన్—సిత్తం సిత్తం. (సంచులు మోచికొని పోవుచున్నాఁడు)

[అంత దుబాసిలక్ష్మన్న ప్రవేశించుచున్నాఁడు.]

లక్ష్మ—(సలాముచేసి) మహాప్రభూ! దేవరయాజ్ఞ యేమి?

బుస్సీ—లక్ష్మణా! కూరుచుండుము, బొబ్బిలివారిప్పటికయినను మన దర్శనమునకు రాలేదు గదా? యుద్ధము కావలసినదియేనా!

లక్ష్మ—ప్రభువర్యా! బొబ్బిలివారు—

మ. ధనవంతుల్ బహుశౌర్యవంతులును వి♦ద్యావంతులున్ వారికిన్
మనలక్ష్యం బిసుమంత లేదు మనలన్ ♦ మన్నింపఁగా రారు రా
మనరేంద్రోక్తులు సత్యముల్ మనల జం ♦ పన్ యుద్ధసన్నద్ధులై
పనులం జేయుచునుంట నిక్కమనుచున్ ♦ భావింపఁగా నయ్యెడిన్.

గీ. వారి యుద్ధప్రయత్న మీ ♦ వరుస నున్న
నేమి చోద్యము చెప్పంగ ♦ లేము గాని
దామెరకులీనుఁ డగుధర్మ ♦ నాముఁ డిపుడు
వచ్చె నట నుండి యిట ♦ రాయబారి యగుచు.

బుస్సీ—ఏడి యెక్కడకు వచ్చినాఁడు! వాని యభిప్రాయమేమి?

లక్ష్మ—నాకడకు వచ్చి "రావువారు సంధి చేసికొందురు, బుస్సీ దర్శనము చేయింపు" మని నన్నుఁ గోరినాఁడు.

బుస్సీ—విచారించెదంగాక పిలిపింపుము.

లక్ష్మన్న—(భటునిం బిలిచి) నాపటకుటీరంబున నున్న వెలమ దొరను తీసికొనిరా. పో.

భటు—సిత్తం సిత్తం (నిష్క్రమించుచున్నాడు.)

[అంత నాయుధపాణియగు ధర్మారావు ప్రవేశించుచున్నాఁడు]

ధర్మ—(వంగి బుస్సీకి సలాములు చేయుచున్నాఁడు)

బుస్సీ—(కూరుచుండ నియోగించి) అయ్యా? మీరెక్కడనుండి వచ్చుచున్నారు? ఏపని నిమిత్తము వచ్చినారు!

ధర్మ—రాజుగారినైన దేవరవారి దర్శనార్థము బొబ్బిలినుండి వచ్చుచున్నాను. నాపేరు ధర్మరా వందురు.

బుస్సీ—సరే! మీరాయబార మేమి?

ధర్మ—దేవా! చిత్తగింపుము.

చ. సుజనులు రావువారు పరి ♦ శుద్ధమనస్కులు మానభూషణుల్
ప్రజలకు సిష్టు లెప్డు ప్రభు ♦ భక్తిగలారును తద్విరోధియున్
గుజనుండు రామరాజు తన ♦ కుం గల వైరము దీర్చుకో మహా
వృజినము లాడి మీకుఁ బోర ♦ వెంచె నోకించుక లేనిపట్టునన్.

బుస్సీ—ఆ వెలమవానికడ తప్పు లేదనుట నిజముగునా? అయి నచో మాకుఁ బన్నికుంట యేమి? మాకడకు రాకుంట యేమి?

ధర్మ—శా. పన్నీకుండుట పండమిన్ మఱియుఁ బాపస్వాంతుఁడీరాజుచే
తన్నెగ్గించుచుఁ జేతిక్రిందనిలువం దారొప్పమిన్ మిమ్ముఁజూ
డన్నేఁడుంజను దేమిమున్ దెలియకుంటన్వెన్కఁ బెండింద్లుపై
నెన్నంగొండెము సెప్పరాజు భయమింతేగాని వేఱుండునే.

బుస్సీ — విజయరామరాజు మీకడకు దూతం బుచ్చియుండ లేదా మొదట? దెలియ దందువేమి?

ధర్మ — "బుస్సీ సపరివారుం డయి వచ్చియున్నాఁడు. మనము పనీయమని చెప్పెదము. దానికతఁడొప్పుకున్న సంహరించి వత్తము. మీరును రం"డని మొన్న మొన్న వర్తమాన మంపుచుదూతంబుచ్చినాడు. దానికి మే మంగీకరింపక వానితో రాలేము. ఇది నిశ్చయము.

బుస్సీ — ఈమాట కేమి! బొబ్బిలివారు మిక్కిలి శౌర్యవంతులు బలవంతులు, బుస్సీ లక్ష్యము మన కేమని యుపేక్షించినారు. సమయము వచ్చిన మాకుఁబిండివెట్టంగూడఁ దలఁచినారు. నిశ్చయము

ధర్మ —

చ. హరహర! మీర లిట్లనుట ♦ న్యాయముగా దటువంటిగర్వమా
దొరలకుఁ గల్గ దెప్పటికి ♦ దోర్బలశాలు రైన మీకడన్
గురుతరభక్తిమై నడచు ♦ కొందురు దుష్టుని దుష్టబోధనన్
గర మలుకన్ వహింపఁ దగు ♦ నా యిటు లో జగదేకవల్లభా!

ఉ. కప్పముఁగట్ట లే ననుచుఁ ♦ గల్గిన తప్పున కంత కంతగా
నిప్పుడె కట్టి మీ సెలవ ♦ యేవలబొబ్బిలిఱేఁడు వచ్చి దా
తప్పు క్షమించి మంచు మని ♦ తావకపాదము లాశ్రయించు నో
యప్ప. దయారసంబు హృద ♦ యంబున నంట ననుగ్రహింపవే!

బుస్సీ — ఈమాటల కేమి లే! బూటకంబు లెన్నియేనిం బలుక వచ్చును. సమయము దాటి పోయినది. అయినను మీరాజు బుద్ధిమంతుఁడై కొంత కాలము ప్రవర్తింపఁదలంచునేని విజయరామరాజుం బ్రార్థించి యొడంబడిక చేసికొ మ్మనుము. లేదేని సకుటుంబముగాఁ గోట విడిచి యొందేనిం బొమ్మనుము, అట్లు కాదేని మానూఱువేల మూఁకలొక్క పెట్టువంబడి బొబ్బిలి నున్మూలించుటయే నిశ్చయంబు. మీ బాహుబలంబు మాఫిరంగికడం బనికిరాదని నుమ్మాటికిం జెప్పుము.

ధర్మ—(కోపం బడంచుకొని)

ఉ. బూటక మాడ నే విజయ ♦ భూపతిదూతను గాను సత్యమా
ర్గాటుఁడు రంగరాయమను ♦ జాధిపుదూతను గాని మీకు నిం
తేటికిఁ గ్రౌర్య మాకుటిలుఁ ♦ డేటి ప్రియుండు? తదాశ్రయంబు మ
మ్మేటికిఁ గొమ్మటంచు వచి ♦ యించుట నొంచుట లిట్టులొప్పునే!

క. బాలిశుఁడు కళింగమహీ, పాలుఁడు మము వానిపాలబడుమనుట కడుం
బోలానిమాటగదా నిం, కేలా ప్రాణంబు? మానమేగినదొరకున్

మ. పరుకంటన్ బడరాని పుణ్యవతులున్ ♦ భార్యాదులున్ బిడ్డలున్
బరివేష్టింప విశేషవైభవముతో ♦ వర్తింప నైయొప్పుమా
చిరకాలార్జిత మైనకోట విడి వా ♦ సింబాసి నానామహీ
శ్వరసంసేవితపాదపీఠుఁ డగుమా ♦ తమ్మోజానిఁ బొమ్మందువే?

గీ. తగదు నీకిట్లు మారాజు ♦ ధర్మపరుఁడు
నీవు కోరినవన్నియు ♦ నీకు నిచ్చు
గప్పమంతయుఁ గట్టి నిన్ ♦ గలియ వచ్చు
నాగ్రహము మాని మమ్మున ♦ నుగ్రహింపు.

బుస్సీ—(ఆగ్రహముతో) నీచదువింకఁ గట్టిపెట్టుము. మీరాజేం
ద్రుఁడు విజయరామ నరేంద్రునికిఁ బాదాక్రాంతుఁడై సంధిచేసికొను
టయో కాక సకుటుంబముగా బిరుదునివాసీలతోఁ గోటవిడిచి పోవు
టయో చేయఁడేని మహాయుద్ధంబు సిద్ధంబు. అందు మాకు విజ
యంబు సిద్ధాంతంబు. అని మీరాజుతోఁ జెప్పుము ఇంక మాజా
డితినేని నిను వెడల నడిపింతు నని తెలిసికొమ్ము.

ధర్మ—(కాలాగ్ని రుద్రుఁడయి కనలి పండ్లు పటపటంకొఱుకుచు)

శా. ఏ మేమీ! యిటు చెండనాడెదవు లో♦నింతేనియున్ ధర్మమున్
మామర్యాదయుఁ జూడ నెంచవు జగ ♦ న్మాన్యప్రతిష్ఠాఢ్యు లీ
భూమీశుల్ నడికోర్వరాయుధములన్ ♦ బొల్పొందఁగా నెంత్రుసీ
మీమాత్రంబు నెఱుంగలే వయితి పా ♦ పీ! నాపసం జూతువే.

గీ. న్యాయమార్గంబు పలికెదు ♦ నన్ను నీవు
వెడల నడపింపు నంటివి ♦ వెడకుఁ దగుదు
నిన్ను నీకత్తి నిప్పుడే ♦ మన్నెగొందుఁ
బ్రాణ మిది యేల మానంబు ♦ పాయుచున్న.

(అని లేచి కత్తి దాటింప నుంకించుచున్నాఁడు)

బుస్సీ—(గడగడవడంకుచు లక్ష్మన్నతో రహస్యముగా) హాహా! మహోపద్రవము వచ్చినది. న న్నీయుపద్రవంబునుండి యెట్లు తప్పింతువో తప్పించి నా ప్రాణమురక్షింపుము (సంభ్రమించుచున్నాఁడు)

లక్ష్మ—(ధర్మారావుం దరిసి ప్రార్థించుచు) ధర్మరాజా!

చం. త్వరపడకయ్య బూసిదొర ♦ వాసి యెఱింగినవాఁడు మీఁపయిం
గరుణ దలిర్చునట్లు వెడు ♦ కంబొనరించెద నిప్పు డాఁకటం
జిరచిరలాడుచుండె మన ♦ చెప్పినమాట చెవిం బడంగఁ బో
దరయఁగఁ గార్యముం జెఱచు ♦ నట్టివిధం బిది నీకుఁ జెల్లునే.

ధర్మరాయాగ్రణీ! నా చెప్పినమాట లన్యథా ప్రవర్తింపఁ జేసి నీ విట్లాగ్రహంబునఁ గత్తి నెత్తుట కార్యానుక్రమసంధానంబు కాదు. శాంతింపుము. శాంతింపుము. (చేయి పట్టుకొనుచున్నాఁడు)

బుస్సీ—(పాఱిపోవుచున్నాఁడు)

(తెరలోఁ గలకలానంతరము)

శా. నిన్నుం బట్ట దలంచినా రదులు ని ♦ర్నిద్రప్రతాపప్రభా
వౌన్నత్యంబున నత్కొలంకుల బలం ♦ బాసన్నమై యుండె మా
కు న్నీ చెంపకు రాఁగ నాఁక పడియెం ♦ గ్రూరాసివారంబులన్
గన్నాకై నకృపాణ మే జతగ రా ♦ నల్పొందు ధర్మప్రభూ.

ధర్మ—(ఆకర్ణించి తనలో) పరులు నన్నుఁ బట్టికొందు రని నా భటులు నాకుం దెలియఁ బలుకుచున్నారు. నే నిట నున్న నాకు

భంగంబు గలుగు ననియే తోఁచుచున్నది. విజయరామరాజులు మహా నీచులు నీచప్రకారంబులకుం బ్రయత్నించువారు (అటు నిటుం జూచి మహాలాఘవంబునం బఱవఁ దలంచుచున్నాఁడు.)
(తెరలోఁగలకలానంతరము) గిర్తే మారో, మారో, పకడో, పకడో.
(అంత హైదరుజంగును, విజయరామరాజును, ఇరుకడ నిలువ విచ్చు కత్తులతోఁ బరవళ్ళుదొక్కుచు వీరభటులు ప్రవేశించుచున్నారు)

ధర్మ—(చూచి తప్పించుకొని పాఱిపోవుటకుం బ్రయత్నించుచు నిటు నటుం బఱువు లెత్తుచున్నాఁడు)

హైద—కోన్ రే వస్తాద్! లాడుఖాన్! ఐసాగిర్తే హైబద్మాష్ మారో మారో, పకడో పకడో.

విజ—ఓహో ప్రధానయోధులార! ఇతండు ముదిసినవాడయ్యును మిక్కిలి లాఘవము గలవాఁడు సుఁడీ!

చ. ముదుకఁడు ద్రోణుఁడెట్లు రణ♦ భూతలశత్రులు ముట్టడించినన్
బెదరక లాఘవంబు మెయి ♦ బీరము తోరముగా మెలంగునో
మదిసిన నీతఁ డట్లు మన ♦ ముందర నున్నటు లుండు నంతలో
నదను గ్రహించి కన్మొఱఁగి ♦ యవ్వల దాటుజుడీ రయంబునన్.

గీ. సింగ ముచ్చునఁ బడ్డట్లు ♦ రంగరావు
దూత మనచేతఁ బడె నిప్డు ♦ ఖ్యాతిమెఱయ
నెట్టులే వానిఁ బట్టుఁడీ ♦ ముట్టడించి
వానిఁ బట్టుట కోటను ♦ బట్టుటరయ.

హైద—తూరీగ లాగా యెగిరీపోతాడు వుంది. వీడికిపట్టువాలా మనకి ఖట్టం అవుతూ వుంది. కాని వస్తాద్ లాడూఖాన్! దేఖో దేఖో పకడో పకడో,

భటులు—(పరువులెత్తుచున్నారు.)

ధర్మ—(ఇటు నటుం బఱచుచుఁ గత్తిఁ ద్రిప్పుచు నెగిరిపోవును.)

భటులు—(సంభ్రమముతో) అ రే రే రే బద్మాష్ గయాహై మారో మారో (తుపాకులు ప్రేల్చుచున్నారు)

విజ—(నివ్వెఱపడి)

గీ. మెఱపు మెఱసిన చందాన ♦ మెఱసి మెఱసి
కంట మసిఁ బ్రామి మనలను ♦ గంటు పఱచి
దూత ముదుకండు గికురించి ♦ దూఱె నకట
మన ప్రయత్నము విఫలమై ♦ మంటిఁ గలిసె.

హైద—బడా ఆద్మీ బడావస్తాద్ వున్నాడు! మనకీ బామ్మా గట్టీ మనీవారినీ చావగొట్టీ పారీనాడ్. హెంత మోసం. మనంపర మోస చేసినామ్. చనంతప్పీపోతే బుస్సీతలా తెగీ పోన్. హెంత మోసం హెంత మోసం.

విజ—ఖానువర్యా! కడచినదాని కింత చింతింపఁబనిలేదు, మనకు బుస్సీదొర యాజ్ఞయైనది గావున మన మందఱము నిప్పుడే కోటముట్టడింత మురండి, మనవృత్త మెఱిఁగి బొబ్బిలివారును యుద్ధసన్నద్ధులై యుందు రనియే నానిశ్చయము.

(తెరలోఁ గలకలము)

హై—అచ్చాభాయ్! మనాలష్కర్మైడంకాబజాయింపూ అవుతూవుంది లెండు యుద్ధంకు తయ్యారుకెండు. పయానంకండు.

(అందరూ లేచి నిష్క్రమించుచున్నారు)

ఇది ద్వితీయాంకము



శ్రీ

# బొబ్బిలియుద్ధము



## తృతీయాంకము



స్థలము : బొబ్బిలి సభాభవనము

[వెంగళరాయఁడు, నరసరాయఁడు, చెలికాని వెంకయ్య, కాకర్లపూడి వేంకటరాజు, కొందఱు సేవకులునుం గొలువఁ గొలువుదీరి రంగారాయఁడు ప్రవేశించుచున్నాఁడు]

రంగా — మంత్రివర్యులారా! మచిలీపట్టణంబున కరిగిన మంతెన బుచ్చనయింత మసలుట కేమి కారణమో? గోడుఁదొర గారవించెనో లేదో!

నర — రాజాగ్రణీ! గోడుఁదొరకు మనపై గారవంబు మెండు. కావున మన బుచ్చన నాదరించి బుస్సీకిం దెలియఁ బుచ్చుననియే నా నమ్మకము.

వెంగ —

శా. ఆగోడుఁదొర బుస్సియొక్క తెగవా ♦ రాంతర్యమం దిద్దఱున్
రాగం బందిన వార లొక్కఁడుని ప్రా ♦ రంభంబు వేఱొక్కఁడౌ
బాగంచున్ వచియించుఁగాదనఁ డెవం ♦ డాటింపనస్మత్కృతుల్
యోగింపన్ బుసికాతఁ డేమయిన వ్రా♦యుంబో యనంబోలు నే.

చె. వెం — కం. వ్రాసినను వ్రాయు గోర్దొర
చూసి యొకింతయును దాని ♦ మున్నిడుకొనుచుఁ
వాసిఁ గనఁడు బుచ్చన కా
యాసమె కాకింతయైన ♦ నట ఫల మున్నే

కా. వెం—

మ. అరయన్ రాజు పిశాచరుండు కలుష ♦ వ్యాపార పారీణుఁడున్
వరసచ్చక్రహరుండు వాఁ డిపుడు నన్ ♦ వర్తింపఁ ఘోరామయో
త్కరమందున్ మఱలింపఁ బూని తఁ ♦ త్రంబులఁ బొసంగించి గో
ర్ధోరచిత్తంబు మరల్పనోపు బుసిపొం ♦ దుం బొంది తానుండుటన్.

రంగా—

మ. అకటా! మీర లిటాడఁ జెల్లునె దయా ♦ స్వాంతుండు గోర్, రెడ్డినా
యకుఁ డత్యుత్తముఁ డాతనిం గెలుచు నె ♦ ష్టయ్యెద్దయున్ రావువా
రికిఁ బక్షంబు వహించియుండు రెవ రే ♦ రీతిం బ్రబోధించినన్
సుకృతం బొక్కసుమంతయుండిన ఫలిం ♦ చుం గార్యమప్పట్టునన్.

కానీ! మిత్రులారా! బుచ్చన్న నేఁడు వచ్చునని తెలియవచ్చినది కదా! రానిండు. సర్వము విశదమయగు; ధర్మరావునుం బోయి కొన్ని నాళ్ళయ్యె. నతని జాడయును దెలియరాదయ్యె. సరే, సేవకా! పురోవకంఠంబున కెదురేఁగి బుచ్చన్న రాక విచారించి రమ్ము పొమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

బుచ్చ—(ప్రవేశించుచుఁ దనలో)

మ. చతురుం డీతఁ డటంచు నన్నుఁ బసిచెన్ ♦ సంధింబొనర్పంగ నా
గతి యంతన్ వితథయ్యె నే నిపుడిటం ♦ గాన్పింప నేమయ్యెనో
హితుఁడా! కార్యమటన్న మన్న దొరతో ♦ నేమంచు వాక్రుచ్చెదన్
హితమున్ జేసికిఁ గూర్పలేని మనుజం ♦ డేలా? యొడల్ కాల్పనే.

హాహా! కాలము చెడ్డదయినప్పు డెంతవాఁడు నేమియుం జేయఁజాలఁడు గదా! కానీ కానున్నది కాకమానదు. (సమీపించి) జయము జయము మహారాజా!

రంగా—(పరికించి) ఓహో! ఆడఁబోయిన తీర్థ మెదురైనట్లు మాబుచ్చనయే వచ్చియున్నాఁడు. మిత్రమా! రమ్ము పీఠ మలంకరింపుము.

బుచ్చ—విశ్రమించుచున్నాఁడు.)

రంగా—మిత్రమా! గోలుకొండదొర సుఖమైయుండెనా? విశేషమేమి?

బుచ్చ—తే. గోలుకొండదొర సౌఖ్యమున నుండెఁ గువలయేశ!

నేను మీరాయబారిని ♦ నా సతంబు
కుతుకమునఁ జేర రమ్మని ♦ కుశల మడిగి
గారమున మిమ్ము మెచ్చి నన్ ♦ గౌరవించె.

రంగా—వింటిరా! మిత్రులారా! గోలుకొండదొర వృత్తాంతము?

బుచ్చ—నేను రెడ్డినాయనిముఖంబున మన వృత్తాంత మంతయు వినిపించితిని. విని విజయరామరాజు పరమదుర్మార్గుఁ డని నొక్కి వక్కాణించెను.

రంగా—గోలుకొండదొర యెప్పటికి మనపక్షమువాఁడే. తరువాత?

బుచ్చ—వెలమదొరలు ఉత్తమోత్తములు. వారిపైఁ గలహింపవలదని యావద్వృత్తాంతమును దేట తెల్లముగాఁ దెలియునట్లొక జాబువ్రాసి మర్రైన కిచ్చి బుస్సీకడకుం బుచ్చె.

రంగా—సరే! మనకింక దిగ్విజయమే, తరువాత?

బుచ్చ—జాబుం జూచి బుస్సీ హైదరుపై మండిపడినాఁడు.

వెంగ—మండిపడిన వాఁడు మండిపోయెనా? మఱి విజయరామ రాజో?

బుచ్చ—వానికినిం బ్రాయశ్చిత్తమైనది.

నర—ఆ. కడుపులోని చల్ల ♦ గదలకుండఁగ నీడ
పట్టునను సుఖంబు ♦ వడయుచున్న
మనకు లేనిపోని ♦ వనటఁ దెచ్చిన వాని
కెట్టియాపదలును ♦ బట్టఁదగును.

రంగా—మిత్రమా! తరువాత?

బుచ్చ—మూసాబూసి రోసంబువం జేసి వారిం దూరి పోరు ఘూన సంకల్పించినాఁడు.

రంగా—(సంతోషముతో) తరువాత ?

బుచ్చ—వారు మిక్కిలి జడిసి యుక్తికంబునం గొంతరొక్కము వానికిచ్చి లేనిపోని నేరము లెన్నో కల్పించి చెప్పి మనపై మరల నీ సెక్కించినారు.

రంగా—చీ! చీ! బూసి గడ్డి గఱచి యంతలోనే పరాఙ్ముఖుఁడై మనపైఁబడ నెంచినాఁడా? కానీ! విచారించెదం గాక. మిత్రులారా! వేల యని నన్నుఁదూలనాడెదరేమో ? రాజులకుఁ జతుర్విధోపాయం బులు సనుప్రయుక్తంబులుం సుఁడీ !

నర—అన్వీక్షిక్యాది రాజకీయధర్మంబు లన్నియు నెఱింగి మహా రాజవైన నిన్నుఁ గాదనువాఁ డెవఁడు ? నీచేఁత సంస్తవనీయంబకాని సామాన్యమా ? చవిటినేలవిత్తనం బంటకున్నఁ బొలము కాపు నిం ద్యుఁడా ? అవి యటులుండుఁగాక. ద్వితీయంబున నైన ధర్మరావెట్లు కార్యంబు సాధించుకొని వచ్చునో ?

వెంగ—ఆఁ! ఇతఁడు చేసినాఁడు, అతఁడు చేయునున్నాఁడు! కానీ యీ చెవులతోడనే వినకపోదుమా !

[అంతఁ దత్తఱపాటుతో దౌవారికుఁడు ప్రవేశించుచున్నాడు]

దౌవా—అయ్యలారా! నెత్తురుగుడ్డలతో మనధర్మారావు తత్తఱ పడి వచ్చుచున్నాఁ డది యే ముపద్రవమో ?

అందఱు—(సంభ్రమ మభినయించుచున్నారు)

[అంత రక్తసిక్తాంగుఁడును సాయుధహస్తుండు నగు ధర్మారావు ప్ర]

రంగా—(చూచి భయసంభ్రమములతో) మామా! యేమి యీ యుపద్రవము ?

వెంగ—మతేమియుం గాదు కఱకుతురకల నఱకులచుఱుకు.

ధర్మా—నాసంధి వారి కనుసంధింపక నన్ను బంధింప నెంచిన వారి గ్రమందించి వచ్చితిని.

రంగ—ఏమిసువృత్తాంతము ? అట్లేల జరిగినది ? ఇందు విశ్రమించి సాకల్యముగా నెఱింగింపుము.

ధర్మా—నేనుబోయి ద్విభాషిలక్ష్మణునితో సంభాషించి తన్మూలమున నేకాకి యగు బుస్సి దర్శనముచేసి కార్యము దెస వాఁడనై చెప్పవలసినంత వట్టు చెప్పితిని. దానికి వాఁడంగీకరింపక తన మాటకు మాఱాడిన నన్ను వెడల నడిపింతు నని పలికినాఁడు.

రంగా—దానికి నీ వూరకుంటివా ?

వెంగ—పాపమూరకుండ కేమిచేయును; మూఁడుకాళ్ళముదుసలి?

ధర్మా—(వెంగళరాయనింజూచి తలపంకించి) రాజా! ఊరకుండు దునా? మహాగ్రహంబునం గత్తినెత్తి తల నఱకవేయు నుంకించితిని. కాని యంతలో దుబాసి నా చేయిపట్టుకొని సామంబునుసంధించినాఁడు ఆ సందున వాఁ డెందో పాఱిపోయినాఁడు.

వెంగ—(అనిష్టమునఁ జేయి విదులుపుచు) ఛీ ఛీ ఛీ ఛీ!

క. ఏమిపని చేసివచ్చితి, వామెయి సమయంబు దొరకె ♦ నానేఁగానీ
నామేనబావ గానీ, యేమైనన్ వాని ద్రుంప ♦ మే? భీతాత్మా,

ఆ. ముసలివగ్గ? నీవు ♦ పో నేల తగుదు న
న్మా యటంచు నటకు ♦ నట్టిసమయ
మబ్బ వాని నేయ ♦ వైతివి నీకత్తి
యేల? శౌర్య మేల? ♦ యేల బ్రతుకు?

వాని నొక్కనిం దెగటార్చినచో మన కే యిక్కట్టును లేక పోవునుగదా ? ఎంతపని చేసితివి ? ఎంతపనిచేసితివి ? దుబాసి సామంబును సంధించినాఁ డని చెప్పుచుంటివి. వాఁడు మాత్రము మంచి వాఁడా ? మన వలన లంచంబు దిని వానివలన నుపకరింపఁ జేయు నున్న పరమ దుర్మార్గుఁడు. వానిం గూడ నీ కరవాలంబునకు ద్వితీయకబళంబు సేయరాదా ?

ధర్మా—(క్రోధముతో లేచి) ఓరి మూఢాత్మా !

క. ఏలా నీశౌర్యము కర, వాలమ్మిది యేల ముసలి ♦ వగ్గా యనుచున్
వేళాకోళము చేసితి, వే లోకనిపింతు రమ్ము ♦ దేపన యున్నన్
(అని పరవళ్ళఁ ద్రొక్కుచుఁ గత్తిం ద్రిప్పుచున్నాఁడు)

నర — అన్నా! శాంతింపుము. శాంతింపుము (చేయిపట్టుకొనుచు.)

రంగా — (మోర బిగించి పండ్లు పట పటం గొఱుకుచు వెంగళ రాయని దిక్కు మొగంబై)

చం. మదమునఁ గన్ను గానకిటు ♦ మాన్యులతో నెకసక్కె మాడుచున్
ముదుసలియంటి చూడుమదె ♦ మొమ్మనవాల్గల రుద్రుఁడో యనన్
గదనము సేయ వాలుగొని ♦ క్రాలెదు దా మొర ధర్మరాజు నీ
మద మది యేది చూత మొక ♦ మాఱెదిరింపుము వీఁక నీతనిన్

గీ. కండకావరమ్ము ♦ కాఱులు ప్రేలుచు
మంచిచెడ్డ లెల్ల ♦ నెంచ నీవు
పడుచువాఁడ ననుచుఁ బడి కొట్టుకొందువు
ముసలి ముసలి గాదు ♦ ముసలిగాని.

వెంగ — (లేవ నుంకించుచున్నాఁడు)

బుచ్చ — (చేయి పట్టుకొని కూరుచుండఁ బెట్టుచున్నాఁడు)

రంగా — సీ. బుద్ధిగలవాఁడ వేని నా ♦ సుద్ది విశ్వ
సించువాఁడవ యేని లో ♦ నెంచి శుభము
ధర్మరాయని కాళ్ళుల ♦ దండ మొఱఁగి
సైపు మంచును బ్రార్థింప ♦ నోపు నీకు

నర — ధర్మరాయా!

గీ. అన్న చేతిక్రింద ♦ నన్నివిధంబులఁ
బెఱుగుచున్నయట్టి ♦ పిన్నవాని
మాట కింతకోప ♦ మా? నీకుఁ దగునయ్య
కన్నకొడుకుమీఁదఁ ♦ గత్తిఁ గట్ట.

(కూరుచుండఁ బెట్టి) వెంగళరాయ! ఈతం డపుడు బుస్సినేయుట సుకరంబ కాని దూతకృత్యంబు వహించి యుండుటం జేసి కార్యంబున

కెక్కుడ భంగంబు వచ్చునో యని సంశయించె నిది యుక్తంబ నీకు దాయ చాకుండఁ గాయని కోపంబ కాని వేఱొండును లేదు.

వెంగ—(లేచి ధర్మారావు చెంగటికిం జని చేతులు జోడించి)

చ. ఎఱుఁగక తప్పు చేసితి న ♦ హీనపరాక్రమ! దాయ నేయఁగా
దొరకక పోయెఁగా యనుచుఁ ♦ దొరపుఁగిన్క మదిం గలంప నొం
డరయఁగ లేక దేవగురు ♦ వంత మహాత్ముని దూల నాడితిన్
దురితము గట్టికొంటిని న ♦ నుం గొమరుం డని సైఁచి కావవే.

(కాళ్ళమీఁదఁ బడుచున్నాఁడు)

ధర్మా—(లేవనెత్తి) వత్సా! వగవకుము మన కెంత శౌర్యమున్నను నంత శాంతం బూనుటయే విభూషణంబు. బుస్సీనేసినంతం బోవునా! పైన సాల్బజ్జంగు లేఁడా? యతండసమర్థుఁడా? మముఁబోంట్లు నీ చెప్పినట్లు వేగిరించి రాజకార్యవిఘాతంబు సేయ వచ్చునా? పడుచుతనం బెల్లడం బనికి వచ్చునా?

రంగా—

శా. మామా! మాటలు రాని బాలుఁడు మహా ♦ మాత్సర్యగర్వామయో
ద్దామస్వాంతుఁ డితండు యౌవనమదో ♦ ద్గారంబునం గావలే
కే మైమాన్యుల ధిక్కరింప విన న ♦ య్యెం దప్పు సైరించి నన్
నీమేనల్లుని నిర్మలాత్మ గలుగన్ ♦ వీక్షింపుమీ మ్రొక్కెదన్.

ధర్మా—రాజా! దీనికింత యేమిటికి? మన వేంగళరాయఁడు నాకుఁ బుత్ర ప్రతిముఁడు గాని శత్రుండా? అక్షణ మట్టిది. అది యట్లుండ నిమ్ము. తఱువాత జరిగిన చిత్రకథ వినుము.

రంగా—మామా! నాచిత్తం బిప్పటికి స్థిమితపడినది. తఱువాత సంగతియేమి?

ధర్మా—నేను మఱలి రాఁదలంచునంతలో హైదరుజంగును విజయరామరాజును కొంతతురుష్కబలంబుతో వచ్చినను ముట్టడించి పట్టుకొనం దలంచినారు.

రంగా—హాహా! ఎంతపని చేసినారు దుర్మార్గులు!

వెంక—

శా. హాహా! హైదరుజంగుశీర్షము కళిం ♦ గాధీశుశీర్షంబునున్
బాహాశక్తి నిశాతహేతివిలస ♦ ద్వైశ్వానరజ్వాలలన్
స్వాహాకారముగా గళోద్గళదసృ ♦ గ్వ్యూహోద్యద్ధారాప్లుతిన్
సాహంకారత వేల్వవైతిగద మా ♦ మా! రాజసూయంబుగన్.

రంగా—గీ. విజయరామరాజు ♦ విషబీజవృక్షమై
రావువారి కెంత ♦ రాపు దెచ్చి
పెట్టె! గోడి గాఁగ ♦ నిట్టు లుండి రటంచు
గనఁగ గనఁగ వాని ♦ కన్నుగుట్టె

ఆపాపాత్ము నేమి చేసినను జేయఁ దగినదే, తరువాత?

ధర్మా—అంతలో నే నాముట్టడించిన మూకలం జించి చెండాడి పట్టుపడక యిట్లు విన్నవింప వచ్చితిని మహారాజా!

వెంక—(సంభ్రమముతో) మామా! రామరాజుం గూడ జంపి వచ్చితివా?

ధర్మా—(దైన్యముఖముతో) లేదోయి నాయనా! లేదోయి!

రంగా—మామా! నీవు మూకలఁ జించుకొనివచ్చినప్పుడు మొఱకుతురక యూరకుండెనా?

ధర్మా—వాఁ డూరకుండునా? ఊరకుండిన విజయరాముఁ డూరకుండ నిచ్చునా? నన్నుఁ బట్టుకొను ప్రయత్నము విఫలంబయినప్పుడు కోటముట్టడించి పట్టుకొనుఁడని మూకల కాజ్ఞ యిచ్చె

రంగా—మూసాబూసి నీతో మఱియేమియుం బ్రసంగింప లేదా?

ధర్మా—ప్రసంగింప కేమి? కావలసినంత ప్రసంగించినాడు. ప్రసంగించినదంతయు మనకుఁ బ్రతికూలమే "బిరుదునిషానీలు విడిచి మీ రాజు సపుత్రమిత్రకళత్రంబుగాఁ గోటవిడిచి పోవుటయో, లేదేని

విజయరాముని కాళ్ళు పట్టుకొని సంధి చేసికొనుటయో శ్రేయంబు. కాదేని యుద్ధంబుసిద్ధంబు, అందు విజయంబు మాకుసిద్ధాంతము'' అని చెప్పుమనెను.

రంగా—అన్నా! దుర్మార్గుఁ డెంతమాట చెప్పినాఁడు ఆలుబిడ్డలతోఁ గోట విడిచిపొమ్మనుటయే గాక విజయరాముని కాళ్ళమీఁదఁ గూడఁ బడు మనియెఁగా! హాహా! కాలమహిమ! (క్రోధముతో)

శా. యుద్ధంబుం బొనరించి బొబ్బిలిగడీ ♦ నస్త్రవ్రాత లూగించినన్
వృద్ధస్త్రీశిశుపుత్రమిత్రధనధా ♦ న్యాష్టారముల్ వోయినన్
బద్ధుండైన నశించిపోయినను భా ♦ స్వద్రావువంశోద్భవుం
డిద్ధస్ఫూర్తిఁ దెగించుఁ గాని యితరా ♦ పేక్షం బ్రవర్తించునే.

అ. వె. గీ. గర్భశత్రువైన ♦ నిర్భాగ్యుపాదముల్
పట్టుమన్నవానిఁ ♦ బరమనీచుఁ
బెలుచఁ బట్టి నాల్క ♦ వేయిచీలికలు గాఁ
గోయ వలదె సాన ♦ రాయికత్తి.

అమాత్యవర్యా! మన కిఁకఁ గర్తవ్యమేమి?

నర—యుద్ధమే కర్తవ్యము

చె. వెం—(భయ మభినయించుచు) మహారాజా!

మ. నిశితక్రూరగదాసితోమర శత ♦ ఘ్నివ్రాతసంభూతమై
దశదిగ్వ్యాప్తమహారిసైన్యమెదురన్ ♦ దథ్యం బసాధ్యం బగున్
నశియించుం బ్రజ గోళ్ళఁ బోవుపనికిన్ ♦ గానాను గొడ్డళ్ళు దు
ర్దశ పాలౌదుము కొన్నినాళ్ళు తలపొం ♦ దం దాచుకోరాదొకో.

గీ. రాజుపాదముఁ బట్టగ ♦ రాదుగాని
బొబ్బిలిని వీడి యొండేని ♦ బొంది పొసఁగఁ
గాలమును ద్రోయఁగా రాదె ♦ కాశ్యపీంద్ర!
తొల్లి దేవేంద్రుఁ డొక తమ్మి ♦ తూట మనఁడె

రంగా — వెంకయ్యా! ఎంత వెఱ్ఱివాఁడవు?

శా. నీచత్వంబున సత్కులీనుఁడు కడున్ ♦ జీవించుకంటెన్ నిజ
ప్రాచుర్యప్రతిభా విశేషమున వి ♦ శ్వాబెన్న క్షణం
బే చాలున్ యశమున్ గడించుకొనినన్ ♦ వీరప్రతిష్ఠాఢ్యులీ
లేచర్లాన్వయజాతు లట్టిబ్రతుక ♦ క్షిన్నొత్తురే? చత్తురే?

గీ. ఎప్పటికి లేనిబ్రతుకునం ♦ దిచ్చఁ జేసి
శాశ్వతంబచ్చుమగుకీర్తిఁ ♦ జంపుకొనఁగఁ
గాశలమె? పురుషున కిల ♦ గాజుపూస
బెడఁగుఁ గని మానికము రోయు ♦ వెడఁగు గలఁడె?

మఱియును వారు మహాబలవంతు లత్యధికు లంటి వేని విను.

శా. నా సామే నన నొప్పు తాంద్రకుల ర ♦ త్నంబాత్మ నానొప్పునా
నాసైదోడును విక్రమైకధను లై ♦ న్నన్ వీరు జన్యంబునన్
గాసంతైన వెఱంగు నూననిమదిన్ ♦ గాలాచినన్ లాసులన్
మూసాబూసిపరాసుసైన్యముల ను ♦ న్మూలింప రే వ్రేల్మిడిన్?

ఉ. ఆయినగంటి భూరితమ ♦ మంత యడంచి ప్రభన్వెలుంగుచో
నీయినగంటి వైరితమ ♦ మింత యడంచి ప్రభన్వెలుంగుచో
నాయినుఁ డీయినుం డనగ ♦ నా వర తేజమున న్విభావసు
త్వాయతిలోకబంధువగు ♦ నాయినగంటినృసింహుఁ డెవ్వఁడే?

ఉ. దీమస మొప్పు శాత్రవుల ♦ దీటడఁగింపఁగ ధర్మరాజె యీ
దామెరధర్మరాజు బల ♦ దర్ప మదింబని యంతయున్ జనం
బీమెయి నేడు చూచెను గ ♦ దే! జగదీడితవీరుఁ డీత డా
రాముని గీమునిం దురక ♦ రాజుల గీజుల లక్ష్యపెట్టునే?

గీ. చెలికానినరస భూవర
తిలకంబు నుతింపఁదరమె ♦ దేవళ్ళకు నేఁ
గలనమున నితఁడు కత్తిన్
ఝళిపించినఁ బగర పొగరు ♦ సళ్ళుం బడదే?

క. బుచ్చనయు స్వేంకటరా
జచ్చం బగుభక్తితోడ ♦ సన్మజ్జనమై
చిచ్చులుక నైన వెఱవరు
చిచ్చఱపిడుగులు గదయ్య ♦ చిక్కులయందున్?

క. నీబీర మిా వెఱుంగవు
కాంబోలును శత్రుసేన ♦ కనుఁబడు చున్నన్
నీబారుటిచె గరిమన్
సాబా లోకతూరి తోర ♦ గాస్త్రంభ మగున్.

గీ. ఉక్కు తునకలు గద మన యోధు లెల్ల
గఱకు తురక ఫిఱంగుల ♦ సరకుఁగొనరు
చిత్తజల్లుగ నాటిలో ♦ నెత్తిఁ బడు తు
పాకిగుండ్లకు జంకరు ♦ వీఁక విడరు.

వెంకయ్యా! మనవారి పరాక్రమంబు లిట్టివి. మానంబువోయిన వెనుక మానధనులకుఁ బ్రాణంబు ప్రయోజనంబు కాదుగావున నీమాట యుక్తియుక్తంబు కాదని యెఱుంగుదువు గాక,

అందఱు—మేలు మేలు! మహారాజ మేలు మేలు!

కంచుకి—(ప్రవేశించి) హాసాదు మహారాజ! ఎవడో, యొక హుస్రూపుహుమాయి నెక్కి వచ్చి హజారము వాకిట వేచియున్నాడు. అతండీపత్రిక దేవరవారి కిమ్మని నా కిచ్చినాడు. (పత్రిక నిచ్చును)

నర—(పుచ్చుకొని చదివి) మహారాజ! హైదరుజంగు వద్దనుండి హుసనల్లీఖానుఁడు వచ్చియున్నాఁడు.

రంగా—(ఉత్సాహముతో) వారిలో నతండు పరమోత్తముఁడు. అతం డిపుడు వార్తాహరుండై మన కేదియో మేలువార్త దెచ్చియున్నాఁడు. మీరెల్లరు వాని కెదుర్కోలు సేసి తీసికొనిరండు.

అందఱు—చిత్తము (అని నిష్క్రమించుచున్నారు.)

[అంత నరసరాయాదులతో హసనల్లిఖాన్ ప్రవేశించుచున్నాడు.]

హస—సలాం బందగీ సేయాలి!

రంగా—ఓహో! నాప్రియమిత్రుండు హసనల్లిఖానుండా? రమ్ము. (పీఠముం జూపుచున్నాడు. అంతయు కూరుచుందురు)

రంగా—ఓహో! ప్రాణమిత్రమా! నీరాక మాకు రాకయుంబోలె వీఁకం గూర్చుచున్నయది. ఏకారణంబున నిట వచ్చితివో విన ముచ్చట పడుచున్నవారము.

హస—మహారాజ్! నేన్ మీకీ యెదిరీవస్తాన్. నారా కామీకీ కోపం సేస్తాది. ఖుష్ సేయదూ వుందీ. నిజాం. హమారావజీర్ సాహెబ్ బద్మాషువున్నాఁడు. మీకీ మార్నెకు తయ్యారువున్నాడు. విజయ రాజాకీ మిలాఖత్ అయి లష్కర్కీ షిద్ధంచేసీ నాగోజీ లగాయత్ మునిషీల్తో గల్సిబుస్సీ కిహాచ్చేరి సేయువమయంలో మీ బురుజాల్మీద నౌబత్ బజాయింపూ యిని కొండెం సెప్పినాడ్. ఆడు నాకూ పిలిసి "రావుల్ డంకా నగారా బిరుదూ నిషాణీల్తో గడీ విడిచిపోలేద్! పోకాపోతే లడాయికీ లడాయించీ వున్నాం" సెప్మామన్నాడ్ దాని కీవొచ్చీనామ్ మహారాజ్!

రంగా—మిత్రమా! హైదరుజంగు మాపై నింత యాగ్రహించుట కేమి కారణము! విజయరాముఁ డిచ్చిన లంచంబున కంత కంతగా మావలన మాత్రము తీసికో రాదా?

శా. ముసాబూసి యిదింత సేయుటకు గా ♦ మూర్ఖాత్ము మాయాగతిన్
మోసం బంది యథాప్రవర్తనమునన్ ♦ బో లేక తాఁ దైలపి
ష్టాసక్తిన్ వెనువెంట నంటుభవకం ♦ బట్లాపశుఘ్నోక్తిమై
నాసం జేసి మెలంగుచుండుఁ గలువ ♦ వ్యాపారపారీణుఁడై.

మ. కలకాలంబుగ మా కనుశ్రుతముగా ♦ గవ్వట్టు భేర్యాదులం
దొలఁగం గోటను వీడిపొమ్మనుటయుక్ ♦ దుర్మార్గుఁడా రాజు కా
ఖులు సేవించి మెలంగు మంటయునన ♦ లోచింప నాబూసికిన్
ఖలుఁ డా హైదరుజంగుసాహెబునకున్ ♦ గాగాను నా నొప్పదే.

మిత్రమా! మేమీవలసినది కాక మఱియొంత పైకమిచ్చుకొమ్మ నిన నిచ్చుకొందుము. మఱి యేమి చేయు మనినఁ జేయుదుము కాని యీ రెండును మాత్రము చేయువారము కాము, మాకు బలపద్విరోధంబు వచ్చి ప్రాణములు గోలు పోవలసి వచ్చు నని భయం బిసుమంతయును లేదు మావలన నేర మింతయును లేదు. దుష్టరాజప్రబోధనంబున మాపై నెత్తివచ్చిన రానిమ్ము; దైవమే దానికిఁ బ్రమాణము.

హస—రాజా! మీర్ బహుమంచివార్. మీకీతప్పు లేద్. మీ బిడదూ నీపాసిల్ తీసి వెయ్యాలా వార్కి మంఖకాద్. ఖానిఖాంచం హాలోసనా సెయ్యావాలా వుంది. వారు భలవంతుల్ బడాలష్కర్ కలావార్ వారీకళహాం మనకీమంచీకాద్. మీమంచీ వార్కి జరూరు లేద్. హైదర్ రాజా మ టామీందా వున్నాడ్. వాడికి వాడూకత్తి గొట్టి బాసాసేశాడ్. వాడికీమాటా సెల్తాది. నీకీమాట సెల్లదూ వుంది. మనవీసేస్తాన్ మేరాదాదా! వొక్క నెలా బైటపో. మళ్ళీనీకీ రాజ్యం తెప్పిస్తాన్ షంశయం లేద్. నామాట యిను. ఖత్తీముట్టిసెస్తాన్. పిల్లల్కి కాపాడ్కో వాలా రాజా! నామాటయిన్. నీకిపార్థనా సేస్తాన్. నీకీ దండం పెడతాన్ నిన్నూ సూస్తేసాలాబెంగా యేస్తాదీ వున్నదీ. నీకీ మేలు సేస్తాన్. నామాటా యిన్, నామాటా యిన్.

రంగా—ప్రాణమిత్రమా! నీకు మాపై మిక్కిలి దయగల దని నే నెఱుంగుదును. దానం జేసియే నీవింతయుఁ జెప్పుచుంటివి. నీమాట వినకున్న మాకుఁ బ్రాణగొడ్డంబు వచ్చుటయే సిద్ధము. అయినను,

పంచ, పరంపరాగతాన్వవాయ ♦ పౌరుషాభిమానముల్
పరాపరాత్మగౌరవంబు ♦ ప్రాభవప్రశస్తియున్
జరామయామలన్ నశించి ♦ సగ్గిపోవ నున్నయీ
శరీరమందు నాసఁ జేసి ♦ చంపుకొంగ నాయమే.

ఏది యెట్లయినం గానిమ్ము దాని కింతయునుం జింతింపఁ బలసినపని లేదు. నీకు మాపైఁ బరిపూర్ణానుగ్రహంబే యున్నయెడల వారడిగి నంత సొమ్మిచ్చి వారికర్ప్యమునకు వచ్చి యనురక్తిం బ్రవర్తించెద. ఇట్లు చెప్పి సంధి గావింపుము. కాదేని కానున్నది కాక మానదు. దీని కొండాడకుము. నావలనం దప్పున్నం జెప్పుము.

హాస—(విచారమునఁ దలపంకించుచు) రాజా! సెప్పవాలా సెప్పినాన్. పైనా నీ సిత్తము నేనూ సెయ్యాగలదీ సేస్తాన్. మీాదా దైభం వున్నాడ్. నాకూ సెలవు.

రంగా—నీమాట వినక నిరాకరించితి నని నాపై నాగ్రహింపకుము. మమ్ము మాత్రము మఱచిపోకుము. పోయి రమ్ము.

హాస—చిత్తం చిత్తం. (లేచి సలాములుచేసి నిష్క్రమించుచున్నాడు.)

అందఱు—(లేచి కొంచె మనుసరించుచున్నారు.)

చారుఁడు—(ప్రవేశించి) జయము జయము మహారాజా! శత్రుసైన్యం బంతయు యుద్ధమునకు సన్నద్ధమై యున్నది.

చారు—మహారాజ! రథహస్తిపదాతితురగాదులతో వేనవేలు మహాసైన్యంబు భూమి యీనినట్లెల్లెడం దానయై నిండియుండె. అందుఁ దురుష్కసైన్యంబునకు లాడూఖానుని, పరాసుసైన్యంబునకు లాసుని, కళింగసైన్యంబునకు విజయరాముని, అధికారులం గావించిరి. వారెల్లరును శిరస్త్రాణకవచాదులం దొడిగి ముసల ముద్గర కరవాల భిండివాలాదులను బిఱంగులుం దుపాకులును లోనగు నానా విధాయుధంబుల ధరించి యుద్ధపాండిత్యంబు మెఱయ మోహరించిరి. అమ్మొగ్గరంబున నగ్రభాగంబున లాడుఖానుండును, పిఱింది దెస మహమ్మదుస్సేన్ మయూానులును, దక్షిణంబున జాసూఖాన్ సిద్దీ బిలాలులును, ఉత్తరమున హాసనల్లీఖాన్ షుకురల్లాఖానులును, పశ్చాద్భాగంబున ఛత్రపతి ప్రముఖ రాజపుత్రసమేత పారసీక

యవన బర్బర పుళింద పుల్కసాదులును మధ్యదేశంబున సమస్త కళింగ సైన్యముతో విజయరామరాజును నిలువ నియమించి హైదరు జంగు మహాహంకారంబునఁ బెద్ద కోలాహలంబు సేయుచు నేల గ్రక్కదల నెల్ల సేనల నడపించుకొని మన బొబ్బిలిగడీ ముట్టడింప వచ్చుచున్నాఁడు మహారాజా!

రంగా—(ఆలక్ష్యం బభినయించుచు) హా! హా! మనకోట ముట్టడింప నంత ప్రళయముగా వచ్చుచున్నాఁడా?

శా. రానీ వేలకు వేలు దోమలబలెన్ ♦ రాసూపరానీల నేఁ
గానీ తమ్ముఁడు గాని కన్ దెఱచులో ♦ గాఁ బేరు లేనట్లు గ
న్గో నీలోకము, కాల రాసి జమునిం ♦ గూడంగ సంధింపమే
మూనంబున్న మనుష్యుఁ డిట్టితటి రా♦మన్నించునే ప్రాణమున్.

[అంతఁ దత్తరపాటుతో నొకభటుండు ప్రవేశించుచున్నాఁడు]

భటు—హాసాదు మహారాజ! పరాసుసైన్యము వచ్చి మన కోటపైఁబడుచున్నది. నేనిపుడు హనుమంతు బురుజుమీఁదనుండగా సముద్రపు హోరువలెఁ బెద్దచప్పుడు వినిపింపగా నిది యేమిరా యని లేచి యట్టిత్తి చూచితిని. బాబూ! భూమి యీనిన ట్లెక్కడఁ జూచిన నదియె కనిపించుచున్నది.

రంగా—సరే! నీవుపోయి నీపనిలో నుండుము. ఓహో ప్రధాన యోధులార! మంత్రివర్యులారా! మన కింత మహాయుద్ధంబు సిద్ధం బయినది కదా!

మ. చిరకాలంబునుండి మీరలు మమున్ ♦ సేవించి జీవించుచుం
టిరి, మీతాతలు తండ్రు లిట్లె మిగుల ♦ న్విశ్వాసపాత్రస్థితిన్
స్థిరకీర్తిం గడియించు కొంచుదివికి ♦ న్వచ్చేసి రాలంబు భీ
కరమైవచ్చె భయస్థు లుండుఁడు వెఱల్ ♦ కండాజికిన్ ధీరులై.

అందఱు—(ఏకకంఠ్యముగా) మే మెల్లఁ దెగించి యున్నవారము, చిచ్చుఱుకుటకు నైన సంసిద్ధముగా నున్నవారము.

నర — మహారాజా!

శా. తాతల్ తండ్రులు మేము మా సుతులు మా ◆ తన్వాంగులున్ మా భటుల్
మీ తిండిం దినుచుంటి మీ మెయి గనన్ ◆ మీ దేసఁ క్రీ పోరునన్
మీతోఁ బాటు సుఖంబు దుఃఖము పడన్ ◆ సిద్ధంబుగా నుంటిమా
హా! తీవ్రంబుగ, జూచినన్ జెడుదుమే ◆ నాశించునే బేలయున్.

రాజా! బొబ్బిలిపురంబునం బుట్టినపిల్లికినిం బిఱికికండ యుండునని నీవెన్నఁటికిం దలంపకుము. నీవారు వీరెవ్వరును బ్రాణంబు లాశించి యున్నవారు కారు. చిచ్చుఱుకుటకు నైన సిద్ధంబుగా నున్నవారు, వారికీయుద్ధం బెంత? ఇట్టిచో నిట్లానతిచ్చుట ధర్మంబు కాదు. ఇంక నీవిచారంబు దక్కి కార్యంబు దెసవాఁడవు కమ్ము; లెమ్ము.

రంగా — వీరాధివీరులారా! మీరెల్లరు నాప్రాణబంధువులనియుఁ బ్రాణంబులకుం దెగించి యున్నవారనియు నేనెఱింగియుఁ గార్యాంతరవ్యగ్రహృదయుండ నగుటం జేసి యెఱుంగనివాఁడఁ బోలె నిట్లంటిని గాని వేఱొండుగాదు దీనికి మీ రెంతయుం జింతింపకుఁడు. నా పేరుగాని భారం బంతయు మీదియే. ముష్కరతురుష్కసైన్యంబు వచ్చి పడుచున్నది. లెండు కట్టాయితంబు గండు.

శా. లాడూఖాను తురుష్క సైన్యములకున్ ◆ లాసూ పరాసీలకున్
బ్రోడల్ ఱేఁడులు గా నమర్పఁబడి రే ◆ ఘుం బ్రాపు దీపింపఁగా
నీడంబోవక వచ్చునాబలఁగ మెం ◆ తేడీల్పడం జేయువాఁ
డీడన్ మేల్దళవాయి గా నలుప రా ◆ దే మీకు మీసేనకున్.

ధర్మ — రాజా! ముంజేతికడియంబున కద్దమేల?

ఉ. దండితవీరవైరిజన ◆ దర్పవిదారణదారుణాస్త్రుఁ డా
ఖండలశస్త్రతుల్యసద ◆ ఖండపరాక్రమవిక్రముండు మా
ర్తాండసదృశతీక్ష్ణకరుఁ ◆ డాహవదోహలమత్తచిత్తుఁ డీ
గండరగండ డైనయును ◆ గంటినృసింహనృసింహ మీతఁడే.

అందఱు—(మేలు మేలని పలుకుచున్నారు.)

రంగా—క, మామా ! సేనాపతివై
మామానము గాచిపుచ్చు మా యింక మీఁదన్
మే మెల్ల నీదునుడిలో
నేమెయి వర్తించుచుండు ♦ మీయుద్ధమునన్.

(మెడలోఁ బూలదండ వైవ అందఱు కరతాళధ్వనులు చేయుదురు)

నర—రాజా ! సేనాపదంబున కంతసమర్థుఁడనుగాను, అయినను భారం బంతయు నాపైఁ బెట్టినారు. కావున దేవరయాజ్ఞానుసారం బునం జేతనైనంతవట్టు కార్యంబు దెరవాఁడనై ప్రవర్తించెదం గాక (కలయం బరికించి) ఓహో ! ప్రధానయోధులారా !

సీ. రేబవల్ విడకుండ ♦ నౌబత్తు మ్రోగింపుఁ
డెల్లబలంబు లా ♦ యితము గండు
కోటకొమ్మల మీఁదఁ ♦ మేటిసాధనములు
పాదుకొల్పుఁడు కత్తి ♦ లూఁది కొనుఁడు
మందుగుండు తుపాకి ♦ లందంద నిల్పుఁడు
కాఁగఁ బెట్టుఁడు నూనె ♦ కాకఁ జేఱ
సలుగులు బల్లెము ♦ ల్లలి సాన బట్టుఁడు
విండ్లమ్ము రందుఁడు ♦ వేలకోలఁది
గీ. కరుల హరులను గైసేసి ♦ కడల నిల్పుఁ
డట్టళ్లమీఁద సామగ్రు ♦ లుంచికొనుఁడు
పరిఘ నలుచక్కి దారుల ♦ భద్రపడుడు
బురుజుగము లెక్కి జోదులు ♦ పోరుకొనుఁడు,

మఱియుం గాకర్లపూడి వేంకటరాజు పశ్చిమంబునను, చెలికాని వేంకయ యుత్తరంబునను, దామెర ధర్మారాయఁడు తూరుపునను,

చెలికాని నరసయ్య దక్షిణంబునను వారివారి సేనలతో బురుజులెక్కి కోటను రక్షించుచుం బోవుచుండుఁగాక. నేను నా యోపినంతవట్టు కోటచుట్టునుం జుట్టివచ్చుచుం బోవుచుండెద.

రంగా—మంత్రివర్యా! మనము దండోపాయంబునకు మున్ను రెండుపాయంబులు మాత్ర ముపయోగించితిమి. మఱియుం దృతీయోపాయంబునుం బ్రయోగింపవలసిన విధి యున్నదా లేదా?

నర—రాజా! దానం బ్రయోజనం బిసుమంతయును లేదు. కాని దేవరచిత్తంబున నన్యథా ప్రవర్తించుట నాయిష్టంబు కాదు. కావున మఱియు నొక్కరాయబారిం బుస్సీకడ కనుపుటయే యుత్తమము,

రంగా—మామా! దానికి నీవు తక్క మఱియెవ్వరు సమర్థులు? నీవే పోలు నేర్పునం బ్రవర్తించి రమ్ము.

వెంగ—క. అన్నా! క్రూరులు వారలు
మున్నీ ధర్మావనీశు ముట్టడి వెట్టన్
గన్నారఁ గనియు వినియున్
మిన్నక మఱి యితని నంప ♦ మేలే యటకున్.

నర—క. న న్నేమి సేయఁ గలవా
రన్నరనాథుఁడును బుస్సి ♦ హైదరుజంగున్
దిన్నఁగ నాడక మఱియే
మన్నం దల లూడ వేయ ♦ నా? తెగి వత్తా!

రంగా—అమాత్యశేఖరా! పరాసుసైన్యంబు వచ్చి కోట ముట్టడించి యున్నది. నీవు తక్షణము రావలయు నని పాపారాయుని కొక జాబు వ్రాసి పంపుము.

నర—(తాళపత్రము లిఖించి) భటులారా! మీరు కూరగాయ లమ్ముకొనునట్టి స్త్రీల వేషము వేసికొని రొట్టెలనడుమ నీజాబు వెట్టి

తురకలకుం దొరకకుండఁ దప్పించుకొనిపోయి రాజాముకోటలోనున్న మన పాపారాయని కిందు నేర్పుగం బ్రవర్తించిరండు. (జాబిచ్చును)

భటు—చిత్తము (జాబు గొని నిష్క్రమించుచున్నారు.)

(తెరలో రణభేరి మ్రోఁగును)

రంగా—(సంభ్రమముతో) వీరాగ్రేసరులారా! అదిగో రణభేరి మ్రోఁగుచున్నది లెండు. మీ రెల్లరు యుద్ధసన్నద్ధులు కండు. నే నంతఃపురాంగనల నూరార్చి వచ్చెదను. (అని లేచుచున్నాఁడు.)

(అందఱు లేచి నిష్క్రమించుచున్నారు)

ఇది తృతీయాంకము



శ్రీ

# బొబ్బిలియుద్ధము



## చతుర్థాంకము



స్థలము : కోటలో గోపాలస్వామి మందిరము.

[పురోహితుఁడు పూజించుచుండ దాసీలక్ష్మి యుపచారము చేయుచుండఁ గుమారునితో మల్లమాదేవి ప్రవేశించుచున్నది]

మల్ల—ఓ భట్టారకా !

మ. తగ నీలోకము దైవమున్ దలఁచు నా దైవంబు మంత్రంబులం
దగులున్ మంత్రము బ్రాహ్మణోత్తములపాల్ తథ్యంబుగా బ్రాహ్మణుల్
జగతీదేవులు తత్కృపారసమునన్ సర్వార్థులన్ ప్రీల మే
లగు మీరట్టి మహానుభావు లెవ మమ్మాలించి రక్షి పుఁడీ.

గీ. ఆధు లడఁగించి వ్యాధుల ♦ నవలఁ ద్రోలి
మృత్యుదారిద్ర్యములు తల ♦ లెత్తకుండ
సలిపి జగ మేలు మీపాద ♦ జలజములకు
మ్రొక్కుచుంటిమి మముఁ బ్రోవ ♦ దిక్కు మీరు.

పురో—అమ్మా! బ్రాహ్మణప్రభావం బిట్టిదియే కాని దైవ మనుకూలింప నప్పు డెవరేమి చేయఁగలరు? కానిమ్ము మనకీ గోపాలమూర్తి యిష్టదైవంబు గదా. ఇతని సేవించిన సకలార్థసంసిద్ధి యగును గావున నితనిం బ్రార్థింపుము.

మల్ల—(లేచి చేతులు జోడించుకొని)

మ. కులదైవంబవయి ప్రభావనిధివై ♦ ఘోరామయధ్వంసివై
కలకాలంబుగ నిచ్చటన్ వెలసి మా ♦ కష్టంబు లెవ్వేళలం

దౌలఁగం జేయుచు మమ్ముఁ బ్రోతు విపుడీ ♦ దుఃఖాబ్ధిలోనుండిమా
కొలమెల్లం దరిజేరఁ జేయవె దయన్ ♦ గోపాలచూడామణీ.

కోకిల. పిడుగుగములను బగంగిమూఁకలు ♦ వేలకు వేలయి ప్రోలన్
దురంబు సలుపఁగఁ గరంబువీఁకను ♦ దుర్గముచుట్టునుజాలన్
బిరానఁ గవిసిరి స్థిరానుభావము ♦ పెంపుగఁ బోరుదు రేలా!
వరాలొసఁగిదయ మొరాలకింపవు ♦ భారమొకో యదుబాలా

గీ. లక్షలకొలంది నీకోట ♦ నీక్షణమునఁ
గూల్చ నీవారి సమరాగ్నిఁ ♦ గాల్చ నెంచి
మూఁగికొనియుండెఁ బరసేన ♦ లాఁగ లేము
మమ్ము మామానమును గాంచి ♦ మనుపవయ్య.

(కుమారుం జూపుచు)

ఉ. ఈనిసువొక్కఁ డీకులము ♦ నింతటి కీతనిఁ గూర్మినిప్పురిన్
మానుగ రాజ్య మేఁకొను ♦ మార్గమునన్ బ్రదికించి ప్రోవరా
దా నిను వేఁడుకొంటినిఁ గృ ♦ తాంజలినై సకలంబు నాశనం
బైనను సంతసంబ సుమ ♦ నాన్వయపాలక! గోపబాలకా.

పురో—హా! హా! దేవి! యేమియిది? నీకొమారు నొక్కరుని మాత్రము బ్రదికింపు మనియుఁ దక్కిన సకలంబు నాశనంబైన సంతసంబనియుఁ బలుకుచుంటివి? ఏమి యీయశ్లీలము? ఏమియీయమంగళము! సర్వదా మనకు దైవము మేలుసేయుగాక. పాపము శమించుగాక, యమంగళ మడంగుఁగాక.

మల్ల—హా! హా! ఎంత పాప మెంత పాపము! మాకులమునంతకీ యొక్క నిసు వుండెననియు మమ్ము రాజ్యమేఁకొను నట్లు చేయుమనియు సర్వవినాశకోపద్రవంబు వచ్చునది సమ్మతంబు కాదనియుఁ బలికిన నాపలుకశ్లీలంబుగాఁ బరిణమించినది అయ్యో! అయ్యో! దైవము నానోట నిట్లుగాఁ బలికించినదో? ఏయమంగళము రానున్నదో

హాహాహా!!! (గుడిలోఁ బెద్దచప్పుడు దీపము లాఱిపోవుచున్నవి.)

పురో—ఏమి యీయమంగళము! ఏమియీయపశకునము! దేవీ! యేదో కీడు మూడఁ దలఁచుకొనియే యున్నది.

గీ. కలుగఁ బోవు శుభాశుభ ♦ కర్మములను
నరుల కెఱిఁగించుటకు మున్న ♦ నలువమోము
ఘనుడు సర్వజ్ఞుఁ డగు దేవుఁ ♦ డనుచునట్టి
దూత లనఁగను శకునముల్ ♦ దోఁచుచుండు.

మల్ల—హాహా! దైవసంకల్పము! హా! పరమేశ్వరా!

చ. అనదల నైన నశింపఁ దగునట్టిది ♦ కాలము వచ్చి మాపయిన్
బెనగొని యుండె నిష్టు, ఖలు ♦ వృత్తిని దొల్లిటిజన్మములందు మే
మొనరిఁచినట్టి దుష్కృతుల ♦ కున్నఫలం బిది దీని మేను పొం
దనగు నెవండును న్విధివి ♦ ధానము దాటఁగ నోపఁ డక్కటా!

గోపాలమూర్తియు నాపాటుఁ జూడ లేనివాఁడుంబలెఁ బశ్చాన్ముఖంబు పెట్టినట్టు నాకుఁ బొడకట్టుచున్న వాఁడు స్వామీ! యేమి నాదురదృష్టము?

మ. ఖలు లీవెల్మలు వీరికై సుముఖతన్ ♦ గన్పట్టరా డంచునా
వలవంతం బడునాదువంత వినినై ♦ పన్ లేవిదిత్త్రార్తి నా?
తొలగింపం బడరాని పీడ యని బీ ♦ తుం గొంటవా? యిట్టు ల
వ్వలమోమై తిది యేమి నాయము దయన్ ♦ బాలింపు గోపాలకా!

(కుడికన్నదరుటను సూచించి) హాహా! ఎట్టిదుశ్శకునము లగుచున్నవి. హాహా! పరమేశ్వరా! (పడి మూర్ఛిల్లుచున్నది)

దాసి—(పాదివిలోని శైత్యోపచారములు సేయుచు)

సీ. చచ్చెఁ సుతు సగ్ని ♦ సంస్కారమునఁ గూర్చు
విధిఁ జంద్రమతి చాల ♦ వెతలఁబడదె
యడవిలో మగఁడు తి ♦ న్నెడబాసి పోయిన
దమయంతి యెంతొ సం ♦ తాపపడదె

తనభర్త ప్రాణముల్ ♦ గొనిపోవు యమునితో
నెదిరించి సావిత్రి ♦ గోదలఁ బడదె
ఱక్కసమూకల ♦ చిక్కనంబడి విదే
శమున సీతాదేవి ♦ శ్రమలఁబడదె
గీ. అరులు సభలోనఁ గొని మాన ♦ హానిసేయ
నడలి పాంచాలిపుత్రిక ♦ బడలు వడదె
మఱియు నెందఱెందఱో సతీ ♦ మణులు దుఃఖ
మందరే దీని కింతేల ♦ మందయాన.

తల్లీ! ఊఱడిల్లుము ఊఱడిల్లుము. నీవిట్లు తల్లడంపడ నీకు నూఱుం డొల్లుడిల్లపోయి బిక్కచఱచియున్నవాఁడో చూడుము. ధీరస్వాంతవు నీ కింత వలవంత తగదు. తెమ్ము సేదదేరి కార్యంబు దెసదానవు కమ్ము. నీప్రియుండు మహా బల పరాక్రమ వంతుం డింతలో నీపగాసుల నెల్ల బరాసులం జేసి నీకానందం బాపాదింపఁ గలఁడు ఉమ్మలింపకుము చిత్తవికారజమ్ము లగు శకునమ్ములు విఫలమ్ము లగు నమ్మ, చింతాజ్వరసంతప్తచిత్తవగు నీకిప్పుడన్నియు నపశకునము లట్లె తోఁచుచున్నవి. కానిమ్ము వీని కనేక శాంతిక పౌష్టికవిధు లున్న వని పెద్దలు చెప్పుదురు. బ్రాహ్మణసమారాధనంబు గావించి ప్రతిక్రియఁ జేసికొందము. కోఁదల మందకుము తెమ్ము. కష్టసుఖంబు లెట్టివారికిని గావడి కుండలు. (వింజామర వేయుచున్నది.)

మల్ల—(లబ్ధసంజ్ఞయై లేచి) అయ్యో! నాకెట్టిపాడుకల వచ్చినది దైవమా! నే నేమి సేయుదు నోయి!

చ. బలువుగఁ బుట్టిపుండు నలు ♦ పన్ వెతఁజెందుచునుండ దానిపై
నిలువున మోకు గొట్టినటు ♦ నేఁ బెగడొందుచు గోపబాలునిన్
గొలువఁగ రా నమంగళము ♦ గూడఁగవచ్చెను దుర్నిమిత్తముల్
కలలునుగీడు చెప్పి మదిఁ ♦ గాల్చుచు నున్న విఁకెట్లొ దైవమా.

దాసి—అమ్మా! కల యేమి? నీకు నిద్ర యెక్కడిది? పగఁటి కలలు పాటింపవచ్చునా? అయినను వృత్తాంత మేమి?

మల్ల—నాకల నిక్కమనియే తోఁచుచున్నది. విను నేనిపుడు దుఃఖాక్రాంతచిత్తనై మూర్ఛంబడి యుండ నాకంటికి యొక్కనల్లని పురుషుఁడు పొడుగునం బొడకట్టి నట్టున్నాఁడు. అంతలో నాఘాతుకుండు నామంగళసూత్రంబు ద్రెంచి నామగనిం గట్టి పట్టుకొని పోవుటకుం బ్రయత్నించె.

(తెరలో) ఓరోరీ! మహాపాతకవర్తీ! క్రూరాత్ముఁడా! ఎవఁడురా నీవు?

శా. నేనుండన్ నను గట్టి నామగరితన్ ♦ జే ముట్టి తత్కంఠసూ
త్రానూనప్రభ దూరఁ జేసి కపట ♦ వ్యాపారముం బొంది తౌ
రా! నన్నున్ రిపుతూలకల్పపవనున్ ♦ రంగక్షమావల్లభున్
గానం జాలవు రా ధరన్ బ్రదుకఁగా ♦ గాంక్షింపవా! దుర్మతీ.

శా. పాతాళంబున దూరినన్ మఱి నభో ♦ భాగంబునం బాఱినన్
స్ఫీతాంభోనిధి డాఁగినన్ దెసల కు ♦ ద్వేగంబుమై నేగినన్
భూతప్రేతపిశాచశాకినులతోఁ ♦ బోరాడఁగా మూఁగినన్
నీతల్లిం గతపుత్రఁ జేసెదను ని ♦ ర్నిద్రాసిపత్రంబునన్.

(అని చదువుచు మహాక్రోధమునఁ గత్తి జళిపించుచు రంగారావు ప్రవేశించును)

రంగా—దేవీ! నిన్నుఁ గొట్టి నన్నుం గట్ట నెంచిన దుష్టాత్ముఁ డేడీ వాని నీక్షణంబున నీకరవాలంబున కాహారంబుగావించెను.

మల్ల—హా! నాథా! సకలజగదేకవల్లభా! అనాథను నన్ను రక్షింపుము. రక్షింపుము. (కాళ్ళమీఁదఁ బడుచున్నది.)

రంగా—(లేవనెత్తి యూఱార్చుచు) దేవీ! నిన్నుఁ గొట్టి నన్నుం గట్ట నెంచిన దుష్టాత్ముఁ డేడీ! వాని నీ కరవాలంబున కాహారంబు గావించెదను.

మల్ల—(కంట నీరు వెట్టుచు) నాథా! నీ వుండ నిన్నుఁ గట్టి నీ ప్రాణేశ్వరిం గొట్టువాఁ డెవ్వఁడు?

రంగా—ఎవ్వఁడును లేఁడా? లేనిచో నిట్లేల పలవించితివి?

మల్ల—అది దుస్స్వప్నము మహారాజా!

రంగా—కం. ఏలా యేలా యిటు దీ
నాలాపము లాడుచుంటి ♦ వకటా తగునే
జాలిం బడ రంగమహీ
పాలుని సతి వయ్యుఁ జింత ♦ పాలైతి గదే.

మల్ల—ప్రాణేశ్వరా! మనకన్నియు దుర్నిమిత్తములే తోఁచుచున్నయవి. దుర్నయులా వైరులతోఁ బోరుమాని సంధిం జేసికొని కులంబు రక్షింపు మో దాక్షిణ్యనిధీ! నీకు నమస్కారము

రంగా—సంధి చేసికొన నెంతయో ప్రయత్నించితిని గాని యది పొసంగినది కాదు. యుద్ధమే సిద్ధమైనది.

మల్ల—సంధి వచనంబు లెట్లు నడచెను?

రంగా—"మీ కీవలసిన పన్నునంతయు నిచ్చుటయు కాక మఱి యెంత పైకమైన నిచ్చుకొందుము. మాపైఁ జలం బుడిగి తొలంగిపొం డనినఁ బరాసుల బూసి రోసంబున నన్ను విజయరాముని కాళ్ళం బడి ప్రార్థింపు" మని చెప్పినాఁడు. దానికి నే నంగీకరింపలేను.

మల్ల—(చేతులు జోడించుకొని) జీవితేశ్వరా! దాసురాలి ప్రార్థన లంగీకరింపుము, కోపింపకుము.

చ. వయసునఁ బెద్దవాఁడు బల ♦ వంతుఁడు క్షత్రియుఁ డర్థవంతుఁడుం
భయరహితుండు బుస్సిదొర ♦ ప్రాపకముం గలవాఁడు రామరా
జ్జయమును గోరి తేని యిపు ♦ డాయన సఖ్యము చేసికొంటయే
నయమన నొప్పుఁగాని జన ♦ నాయక! యొండొకఁడైన ముప్పగున్

గీ. దాసురాలిమాట ♦ త్రోసివేయక చిత్త
మందు నాగ్రహంబు ♦ నాననీక
యాలుగోల బాలు ♦ గోల గాకుండఁగాఁ
గులము నెల్లఁ బ్రోవఁ ♦ దలఁపు మీశ,

రంగా—(ఆగ్రహముతోఁ ద్రోచివైచి) ఛీఛీ! మూఢాత్మురాలా!

ఉ. ఏమని ప్రేలితీవు గుణ హీనుఁడు రామనరేంద్రు శాఖలన్
మేము కులాభిమానము ♦ మీఱఁజి, పరాక్రమ ముజ్జగించి, నీ
మామతిఁ జేరి మ్రొక్కి ఖల ♦ పద్ధతిమై బ్రతుకంగఁ బోసి యే
యీమెయి నిల్చుకంటె నశి ♦ యించిన గూడదె పౌరుషంబునన్

పరాక్రమైక జీవనులగు బొబ్బిలివారంతయును జంపం జావసిద్ధంబుగా నున్నవారు. భయంబయే నంతఃపురాంగన లెల్లర బాలవృద్ధసమేతంబుగా నొంతుకడకుంబుత్తుము; పోయి ప్రాణములు కాపాడుకొనుఁడు.

మల్ల—(గడగడ వడంకుచు) ప్రాణేశ్వరా? స్త్రీచాపలమ్మునం జేసి బేలనై తెలియక కాడిన నాపలుకుల కలుకఁ జెందకుఁడు సర్వలోక రక్షాదక్షు లగు వీరపురుషులే పోవుచున్న మాకు మాత్ర మీ ప్రాణంబులు రక్షణీయంబులా? నేనును బౌరుషాభిమానంబులు గలవెలమ కడుపునం బుట్టితిని గాని పిఱికిపందను గాను. సమయానుకూలసామంబునఁ గార్యసాధన మగునో యని యిట్లంటిని గాని మఱి యొండెమియుం గాదు. నాతప్పు సైఁచి కాచి రక్షింపుమని ప్రార్థించుచున్న దాన (పాదములపైఁ బడును.)

రంగా—ప్రాణేశ్వరీ! ఇపుడు గదా వీరపత్నివైతివి. వీరమాత వనిపించుకొనుభాగ్యము నీకుఁబట్టలేదు దాని కెవ రేమి చేయఁగలరు? ఇంక నీవంతరంగంబుఁ జింత దక్కి యుండుము కుమారుం (గుచ్చి కౌఁగిలించుకొని) నాయనా! చిరంజీవీ! నీవు—

చ. పెఱిఁగియు బెద్దవాఁడ వయి ♦ విద్దెలు నేరిచి యుద్ధభూములన్
గఱకరి శత్రులన్ నఱికి ♦ క్రాలఁగ జూచెడుభాగ్య మయ్యకున్
దొరకక పోయెఁగా కొడుక! నోముఫలం బిటు లుండె నక్కటా
నెఱి గలవాఁడవై కులము ♦ నీతికిఁ దప్పకు మయ్య యెప్పుడున్,

క. నీ తాతతండ్రి తాతయు
నీతండ్రియు నెట్లు మనిరొ ♦ నీ వట్లు జగ

క్షాత్రమెయిఁ బౌరుషంబున
నే తను మాత్రను బొంర్చి నెఱుఁగుము తండ్రీ.

(కన్నీరు విడుచుచున్నాఁడు.)

[తెరలో పిరంగులు వేలుచు అంత సంభ్రమమునఁ గంచుకి ప్ర॥]

కంచు—మహారాజ! మహాయుద్ధ మగుచున్నది.

రంగా—అప్పుడే యుద్ధమా? మనసేనాని వచ్చినాఁడా?

కంచు—మన మంత్రిపుంగవుండా నరసరాయుండు రాయబారము కుదరమిం జేసి యిప్పుడే వచ్చినాఁడు.

రంగా—నాకడకు రాని కారణం బేమి?

కంచు—అతండు వచ్చునప్పటికే వేనవేలు శత్రుసైన్యంబులు వచ్చి మనకోట చుట్టుముట్టడించి పిరంగులుగాల్చియు, తుపాకులు పేల్చియు బాణంబులు పఱపియు, కత్తుల మొత్తియుఁ నీటెలం బొడిచియు, తోలు నిచ్చెనల వెంటఁ గోడపైకెగఁబ్రాకియు, మఱియు ననేక విధోపాయంబుల మనవారిని డీకొని పీఁకం బోరాడుచుండిరి. అదిచూచి తానటు కదలి రా ననువు పడక పోయివచ్చిన వృత్తాంత మంతయు నాతోఁజెప్పి నన్ను మీకడ కనిచినాఁడు మహారాజ!

రంగా—అక్కడ నడచిన రాయబార మేమి?

కంచు—మననరసరాయఁ డొక్కింత సైన్యంబుతో బుస్సి కడ కరిగి "మమ్మ రామరాజు కాళ్ళఁ బడుమనుటయు బొబ్బిలిని విడిచి పొమ్మనుటయు నీకుఁ దగదు. నీకుఁ గావలసినంత సొమ్మిచ్చెదము. పరాక్రమైక జీవను లగు మాతోఁ గయ్యమునకుఁ గాలుదువ్వుట మీకును విజయరామునకుంగీడున కాకరంబగు; మాపరాక్రమం బెట్టిదంటివేనివినుము. మున్ను తుమ్మలగుంటయుద్ధములో లక్షసైన్యముతో గోపాలరాజును, బలుసుపాటి మేటియుద్ధమున నేఁడు వేలయేనూరుదండుతో జగన్నాథరాజును బొబ్బిలివారెదిరించి నాశనంబగుట జగద్విదితము. అది

యటుండ నిమ్మెప్పు డీకతిపయజనంబుతో విజయరామరాజు నెదిరింప
జేసి మీరు తటస్థులై చూచుచుందురు. మేము గెలిచిన విజయనగర
రాజ్యము మాకును, అతఁడు గెలిచిన బొబ్బిలిరాజ్య మతనికి నిప్పిం
పుఁడు. దుర్జాతియైన రాజుమాట నమ్మి మీరు మాపైఁ గత్తిగట్టుట
ధర్మంబు గాదు. ప్రాణము లాశ పక మేమున్నవారము. పోరైనచో
మీరు మఱల మీ దేశంబునకుఁ బోవుట లేదని తెలిసికొమ్ము'' అనిన
నతండు కోపించి హైదరుజంగుం దిలకించిన నతఁడు నరసరాయనిం
బట్టనెంచిన నతండు వారినెల్లరం దునాతునియలు చేసివచ్చి మనవారిం
జేరి పోరుచున్నవాఁడు

రంగా—హాహా! దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం గట్టనెంచినట్లు
దుర్మార్గులు మన నరసరాయనిం గూడఁగట్ట నెంచిరా? కాని మన
సేనాధీశ్వరుండు మంచిపనియే చేసి వచ్చినాఁడు కంచుకీ! మనవా
రెట్లు పోరుచున్నారు?

కంచు—మనవారెల్లరు కోటకొమ్మలెక్కి చెక్కు చెదరక చక్క
నిలిచి నానావిధాయుధవిద్యావైశద్యం బంతయు నగపరచుచుండిరి,
రాజా! మనయోధులమాట చెప్పనేల! మనదాసీజనంబులును బురుజు
లెక్కి గోడలెగఁబ్రాకివచ్చు వారిపైఁ గాఁగిన నూనె చల్లియు జిగురం
బళ్ళు వోసియు, గండోపలంబులు జారవిడిచియు, చీకుతాటియాకులం
బెట్టి వారిం దగులఁ బెట్టియు, జజాయిలాలుం జిమ్ముబుడ్లు దోంలుం
జిమ్మియు మఱియు ననేకవిధంబులం బీరువోక పోరుచున్నవారు.

రంగా—ఆహా! మనపై దాసదాసీజనంబునకుఁ గూడ నెంత
విశ్వాస మున్నది! సరే మనయోధు లేమి చేయుచున్నవారు?

కంచు—మనయోధు లెల్లరు నాయాస్థానంబుల నిలిచి ఘోర
యుద్ధము చేయుచున్నవారు. నారసింహులుఁడు నపరనారసింహునివలె
జూడనొప్పి యెల్లెడం దాన యగుచు నవక్రపరాక్రమంబు నెఱపు

చున్నవాఁడు. మఱియు మన పడాలరామన్నయు, ముత్యాలపాపయ్యయు బారుటీకెలతో వేయిమందిని మ్రందించినారు.

రంగా—బళిబళీ! వారు నాకు నమ్మినబంటులు కదా! కంచుకీ! మన వేంగళ్రాయఁ డెక్కడ? అతఁడు నాతమ్ముఁడని పరాసులకుం దెలిసెనా? లేదా?

కంచు-అతనిం బరాసులగు పరాసు లేమి తెలియ గలరు? హైదరు ప్రముఖముష్కరతురుష్క సైన్యమంతయు బాగుగా గుర్తించినది.

రంగా—(సంతోషముతో) ఏమీ! నాతమ్ముఁడు పరాసులంబరాసులంజేసి తురుష్కులం దూలపుచ్చినాఁడా! మేలుమేలు! తమ్ముఁడా! మేలుమేలు—(తెరలోఁ గలకలము ఫిరంగులు పేలును)

రంగా—(ఆకర్ణించి) ఓహో! మహాసంగ్రామ మగుచున్నది. శత్రులుక్కుమిగిలి నట్లు వినవచ్చుచున్నది. నే నిటనుండ మనం బొప్పక వేగిరించుచున్నది, దేవీ! నే నిదె సమరంబునకుఁ బోవుచున్నాఁడను. నీ విట బ్రాహ్మణారాధనంబు గావించి యుక్తప్రకారంబునం బ్రవర్తింపుము మానము గాపాడుకొనుము.

మల్ల—(తల వంచి కన్నీరు విడుచుచు) హా! నాథా!

మ. ఇఁక నీజన్మమునందు నిన్ గనుట లే ♦ దీపేశునన్ వెండియుం
గొకలోకంబున నెప్పుడో కలుగ న ♦ య్యో జీవితేశా! మొగం
బాకమా ఱిట్టులు చూపు మీకనులతో ♦ నొప్పైనసీరూపుచూ
చికడుం బొందిక డెందమందునిలుపన్ ♦ జింతింతు నశ్రాంతమున్.

క. నతితముసీరూపము నే,మతిఁదలఁచుచుమరణవేళ ♦ మఱువనయేనిన్
గతిగలదునిన్నుఁబొందఁగ నతికరుణన్ మోముచూపి యరుగుము నాథా

రంగా—(చేయిపట్టుకొని) కాంతా! నీకింతసంతాపము చెల్లదు. ఎంతవారికిని జా నెప్పుపకేని దప్పునెది యే మినం.

మ, పురుకుత్సప్రభృతుల్ ధరాతలము రం ♦ పూర్ణప్రభావంబునన్
బరిపాలించి యొకల్ త్యజించి దివమున్ ♦ బాలింపఁగా నేగి రో

కృష్ణుఁడున్ శాశ్వతవిష్ణుకల్పకముగాఁ ♦ గన్పట్టిరే నేలపై
వరకీర్తిం జనువారు చచ్చియును జా ♦ వం బోవ రెప్పట్టునన్.

అజ్ఞానురాలవయి నీవు దేవికినిజింతింపకుము ఏదియెట్లు కానున్నదో యది యట్లు కాకమానదు మనముచేయఁగలది యింతయును లేదు. సర్వమును బురాకృతంబునం గలుగుచుండు కావున నీవు దేవురించుచు గాలంబు వృథసేయక పరంబు విచారించుకొమ్ము. పోయివచ్చెద ననుజ్ఞ యిమ్ము. (నిష్క్రమించుచున్నాఁడు)

మల్ల—హాహా! మహారాజెంతధైర్యవంతుఁడు, అంతబలంబువచ్చి పడిన నావంత యైన వంతంబడక శాంతింబడి యున్నవాఁడు! మంద బుద్ధినగు నేను అజ్ఞానంబునం జేసి తుచ్ఛంబయిన ప్రాపంచికసుఖం బపేక్షించి మహారాజుమదిం గలంగించితి నాహా! ఎంతధైర్య మెంత సాహస మెంతశౌర్యము! పురుషు లన్న రావువారే పురుషులు గాని తక్కినవారిం జెప్పవలయునా? (పురోహితునింజూచి) భట్టారకా! నీవుపోయి శాంతిక పౌష్టిక విధులం దీర్పుము.

పురో—చిత్తము దేవిగారియాజ్ఞ. (నిష్క్రమించుచున్నాఁడు)

మల్ల— చేటీ! విజయరామరాజుగారి యొద్దకు బంచిన కంచుకి రాలే దేమికారణమో? ఆయననాసందేశమున మపల ననుగ్రహించు ననియే నానమ్మకము.

దాసి—అమ్మా! దుర్మార్గుఁ డాతఁడు. నాకు మాత్రము నమ్మకములేదు. అయినను సందేశ మే మని?

మల్ల—వినుము.

శా. నాకుం దండ్రివి నీవు నీసుతను నే ♦ నాకష్టసౌఖ్యంబులన్
నీకు న్వాకొన నొప్పుఁ గావునను దం ♦ డ్రీ నన్ను మన్నింపవే
లోకు ల్గాకులు వారికై స్వజనమునున్ ♦ లోడింపఁగా నొప్పునే
నాకుం గుంకుమబొట్టు నిల్పికరుణన్ ♦ రక్షింపవే ప్రొక్కెదన్.

అని నే నంపిన సందేశము. విజయరామరాజు పిల్లలగన్నవాఁడు కాని గొడ్డువాఁడు కాఁడు. నాదీనాలాపము లాలించి నన్ను మన్నింపక పోఁడు.

దాసి—దేవీ!—దేవర యీ సందేశము విన్నచోఁ బ్రమాదమే వచ్చును.

మల్ల—వేంకటలక్ష్మి! తల్లిలేని యీ పిల్లవాని భారము నీదియే సుమీ.

దాసి—అమ్మా! నీ విట్లనకుము. నీమగండు సకలశత్రుక్షయంబు చేసి నిష్కంటకముగా రాజ్య మేలంగలఁడు, విచారింపకుము.

కుమా—అమ్మా నాకు బుల్లి కత్తితే వాల్లందర్నీ కొత్తి కొత్తి సంపొత్తాను. లచ్చిమీ! నన్నెత్తుకుపో, అమ్మా! యేదనకే యేద వకే, బయ్యంలే దిప్పు దొత్తాను, (అని లేచుచున్నాడు.)

దాసి—అమ్మా! పులిపిల్ల పులిపిల్లయేగాని పిల్లిపిల్లయగునా? రంగారాయ మహారాజచంద్రునకుఁ బుట్టిన వీని కిట్టు తగునుసుమీ!

కంచు—(ప్రవేశించి) జయము జయము. మహారాజ్ఞి! నేను విజయరామరాజు నొద్దకు సందేశహారుండ నయి పోయివచ్చి యున్నాఁడను.

మల్ల—ఏమి వృత్తాంతము?

కంచు—నీజాబు చూచి తా నిట్లు వ్రాసియిచ్చినాడు.

మల్ల—దాని విప్పి నీవే చదువుము వినియెదను.

కంచు—(విప్పి చదువుచున్నాఁడు)

శా. నాకుం గూఁతురువంటిదాన వయినన్ ♦ రాజన్యధర్మం బరిన్
జేకొంచున్ వధియించుటల్ విధి యికన్ ♦ నీనాథునిం జంపెదన్
నీకే నిచ్చెదఁ గొన్ని యూళ్ళు భృతికిన్ ♦ నీతాలె బొట్టావఁగా
లేకున్నందుల కాత్మగుంజకుము త ♦ ల్లీ! మల్లమాంబాసతీ,

మల్ల—(నివ్వెరపడి) అన్నా! అన్నా! అన్నా! దుర్మార్గుఁ డిట్లు వ్రాసినాడు! జేలనయి నేనట్లు జాలిగా వ్రాసినా, నానాథునిం జంపి

నాకుఁ గొన్నియూళ్ళు భరణ మిచ్చునఁట! హాహా! ఎంతదౌష్ట్యము! ఎంతపాపము? హాహా! పాపాత్ముఁడా! క్రూరుఁడా! ఇట్లు వ్రాయుటకు నీచే యెట్లాడెనురా? కఠినాత్మా! నాప్రాఁతకు జాయయినఁగాఁగును గాని నీచిత్తమెంత కఠినమో కాసంతయినం గనఁగ లేమురా గురుద్రోహీ! నాకెట్టియుత్తర మిచ్చితివిరా? పాపీ! చండాల! నీది పిల్లలం గన్న కడుపుకాదురా? (లేచి దుఃఖముతో చేతులు గొడించుకొని)

ఉ. నేను మహాపతివ్రతన ♦ యేని బరార్తిని గోర నేని నా
 మానస మెప్పుడున్ సుకృత ♦ మార్గమునందె మెలంగునేని, కన్
 గానక భర్తఁ జంపి భర ♦ ణంబు నొసంగెద నన్నదుష్టభూ
 జానికులంబు నష్ట మగు ♦ సంతత కష్టము లంది కుందుచున్.

మఱియు నన్నిట్లుడుకించినవాఁడును వానిం బురస్కరించుకొని పాపంబున కొడిగట్టిన హైదరుజంగును నేఁటికి మూఁడవనాఁడు మర్మరణంబు నొందుదురుగాక, వర్తకముపేర నీదేశముంజొచ్చి మహారాజు కులంబులెల్ల మాయించి పరాక్రమంబున నాక్రమించుటయు కాక మమ్ము నున్మూలింప నెంచినపరాసుల కిటఁ బాలనాధికారంబు పటాపంచలగుం గాక. (అని భూమిం గొట్టుచున్నది)

కుమా—(తల్లిం బొదివికొని) అమ్మా! మా బాబియ్యగారితో కూడా వెల్లి వాన్ని పొరిచొత్తాం. అమ్మా! యేడవకే. యేడవకే.

మల్ల-(కుమారునిశిరము పుడుకుచు) నాయనా! మీ నాయనగారికి నీవు తోడుపడు భాగ్యము పట్టలేదోయి! మందభాగ్యులము; మేము నీయానంద మనుభవింప నోచుకొనలేదు. తండ్రీ! మే మెట్లయిన నీవు చిరంజీవి వయి బొబ్బిలిం బరిపాలించుచుఁ గులం బుద్ధరింపుమా మా యన్నా! నిన్నయినఁ బ్రతికించుకొనుమార్గము తోఁపక త్రొక్కులాడు పడుచున్నదాన నోయి బిడ్డా! (జ్ఞాపక మభినయించి) వేంకటలక్ష్మి!

చ. అరణపుదాదివీవు నను ♦ నక్కటికంబునఁ గన్నవారినిన్
 మరియును గొన్నవారిని స ♦ మానముగా మదిలోఁ దలంచుచున్

గురుతరభక్తియుక్తిని గ ♦ నుంగొనుచున్ నిరతంబు నానుడిన్
బరఁగు మఁ గష్టసౌఖ్యముల♦నాకయి యుంటివి గాదె యింతకున్,
గీ. నాకుఁ బరమోపకారము ♦ లోక మెన్న
నట్లు చేయంగ వలసిన ♦ యదను వచ్చె
నిపుడు నీవది చేసి రక్ష ♦ గృపను జూతొ
కాక కాదందువో కాని ♦ కమలపాణి.

దాసి—అమ్మా! యిదియేమి? నన్నింతగా స్తుతించుచుంటివి? నీ దాసదాసీజనంబు ప్రాణము లయిన సమర్పించుటకు సంసిద్ధముగా నున్నదిసుమీ! సంశయింపకుము. నేఁజేయ నయిన దేమో చెప్పుము.

మల్ల—ఓసీ! వేంకటలక్ష్మి! ఇప్పుడు మహాయుద్ధంబున రావువా రెల్లం దెగుట సిద్ధంబు ఆ సందర్భమున నంతఃపురాంగనలకును మరణంబు సిద్ధాంతంబు. కావున వంశవృక్షాంకురం బగు నిక్కుమారు నెటులేని నీవు రక్షింపవలయు నని నిన్నిట్లు ప్రార్థించుచున్నదాన.

దాసి—దేవీ! నన్నుఁ బ్రేమించి పెంచుచున్న రాణివాస మేపోయిన నేను మాత్ర మీపాడుశరీరమును గాపాడుకొనుచుండఁ గలనా? అట్లు గాక కుమారుం బ్రదికించు మార్గ మున్నం జెప్పు మట్టుచేసెదను.

మల్ల—సామర్లకోటలో నా చెల్లెలు జగ్గయ్యదేవి యున్నదికదా! అట కీబాలునిం గొనిపోయి విడిచి రమ్ము.

దాసి—అయ్యో! కోటచుట్టును శత్రువులు ముట్టడించియున్నవారు, వారిం దప్పించుకొని నే నీకుమారు నెట్లు సామర్లకోటం జేర్పఁగలను?

మల్ల—వీనికి బ్రాహ్మణకుమారవేషంబు వేసి తీసికొనిపొమ్ము. నీకీ కంచుకియుఁ దోడువచ్చును.

దాసి—చిత్తము. దేవిగారియాజ్ఞ.

కుమా—ఊఁ! ఊఁ! ఊఁ! ఊఁ! నేను సామర్లకోట వెద్దను. యుద్ధానికి వెళ్తాను ఊఁ!ఊఁ!ఊఁ!ఊఁ! (మూలుగుచు గారాభము చేయును

మల్ల—(కుమారుం బొదివికొని దుఃఖించుచు) నాయనా! చిన వేంకటరామా! నీవు సామర్లకోట కీ దాసీలక్ష్మితో వెళ్ళుము తండ్రీ! అక్కడ నిన్నుఁ బ్రేమించు నీపినతల్లి యున్నది. నీయన్నదమ్ములక్క చెల్లెండ్రు నున్నారు. వారితో నీవు నాడుకొనుచుఁ బాడుకొనుచు సుఖముగాఁ గొన్నినాళ్ళుండవచ్చును తండ్రీ! మఱియు నా సామర్లకోటలో—

సీ. వన్నెచిన్నెలతోడ ♦ వన్నెకెక్కినగురాల్
గున్నయేనుంగులు ♦ నెన్నో గలవు
పొన్నుకత్తులవాఁడు ♦ పిన్నవస్తాదులు
సాములగరిడీలు ♦ చాల గలవు
కన్నులపండువై ♦ కమలముల్ వికసింప
వెలయు కేళాకుళుల్ ♦ పెక్కు గలవు
చిలుకలు గోరువం ♦ కలు వల్లకనులపం
డుగ సేయు నుపవనుల్ ♦ మిగులఁ గలవు
గీ. ఆటపాటలు నను పొందు ♦ మేటిబొమ్మ
పేటికలు నాటకమ్ములు ♦ వేటకుక్క
గములు సివ్వంగులును బులు ♦ లెలుఁగుగొడ్లు
గలవు బాల్య వినోదముల్ ♦ సలుపఁ దండ్రి.

నాయనా! నీవీ దాసీలక్ష్మితో నటకుఁ బోయి రమ్ము తండ్రీ!

కుమా—అమ్మా! సామర్లకోతనుంచి మల్లీ దీనితో దానా? వత్తే నాకు తాయిద్దం పెత్తావా?

మల్ల—(దుఃఖించుచు) నాయనా!

శా. ఈజన్మంబున నేను వెండియును ని ♦ న్నీక్షింపఁగాఁ గల్గు నే
యోజాడన్ సృజియింపలేదు విధి కా ♦ లాసన్నమైయుండెనా
కోజై వాత్సక! నీవు వెండియును రా నూరార్చి తాయిల్లమే
మోజం బెట్టఁగఁ జాలు దాని దయలే ♦ కున్నట్టినేనయ్యయో!

శా. నన్నుం గన్నకుమార! సాధననిధీ! ♦ నాపాలిభాగ్యంబ! నా
యన్నా! ముద్దులపట్టి! నిన్ గవినవా ♦ రంతంతలం బట్టు వా
రెన్నండల్లియునై నెఁదండ్రి యయినన్ ♦ హెచ్చించినన్ గుంచినన్
నిన్నుం జూచినఁ జూడకుండినను దం ♦ డ్రీ! నీకు జగ్గాంబయే.

హాహా! కుమారరత్నమా!

గీ. నిన్నుఁ గన్నది మొదలు గా ♦ నేఁటివఱకు
నిమిష మైనను విడనాడి ♦ నేను మసలు
చున్నయది లేదు నేఁటి ♦ కా పన్నురాల
నగుచుఁ బరులపంచలకు ని ♦ న్నంపుచుంటి.

చ. అరనిముసంబు నన్ గనమి ♦ నమ్మ యె ఁటుగితి వమ్మయంచు బా
వురు మని యేడ్చుచున్ బుడమిఁ ♦ బొర్లుచునుందువు కోపగింతువు
క్కుఱఁ దినిపింపఁ బోవ నడ ♦ కింతు వయోమయము గన్నతండ్రి! ని
న్నరసెడు వార లెవ్వ రింక ♦ నమ్మయు నబ్బయు లేకపోయినన్.

నాయనా! నీవు పెఱిఁగి పెద్దవాఁడవై యువరాజ్యపట్టాభిషిక్తుఁడవై బొబ్బిలిం బాలింపఁ జూచి సంతసింతు ననుకొంటిని తండ్రీ! నాకా భాగ్యంబు లేకపోయినది గదా!

చ. కొమరులు లేక లేక తుద ♦ కుం బరమేశునను గ్రహంబునన్
గొమరుఁడ నీవుపుట్టి తని ♦ కోరిక లీరిక లెత్తనుండి రీ
యమయును నయ్యయున్నడచె ♦ నయ్యది యెల్లనుమూఁడునాళ్లనీ
సుముఖత వారి కెవ్వటికిఁ ♦ జూచెడుభాగ్యము లేక పోయెఁగా.

(ధైర్యము తెచ్చుకొని తనలో) నేనిట్లు చింతించుచున్న ఫలవిఘాతం బగుఁ గావున వేగిరింపవలెను. (ప్రకాశముగా) చిరంజీవీ! నీవునీవారిం కీర్తింగాపాడుచుబొబ్బిలినిపరిపాలింపుచు. పోయిరమ్ము. (చంకకిచ్చును)

దాసి—(కుమారు నెత్తుకొని) అమ్మా! పోయివచ్చెద. (కంచుకితో నిష్క్రమించుచున్నది.)

మల్లి—(మహాధైర్యముతో) నామది కిప్పటికి విశ్రాంతిగలినది. ఇంక నేను నామగండును ఈతుచ్ఛశరీరంబులవిడిచి వీరస్వర్గంబున నిచ్ఛావిహారసౌఖ్యంబు లనుభవించెదము గాక. కాని నాకొక్క సందేహము. నేనునుం దక్కిన యీయంతఃపురాంగనలును బ్రాణములు పాయుటెట్లో తెలియకున్నది. పరాసులు చెలరేగి కోటలోపలికిం జొరకమున్న మరణోపాయంబు చింతించుట పరమశ్రేయము. నామగండు గాని మఱియొకండు గాని వచ్చి స్త్రీల నెల్లరం ద్రెళ్ళజేసినచో ననుకూలంబుగా నుండునుగదా! (ఆలోచించుచున్నది.)

[అంత మఱియొక దాసి ప్రవేశించును]

దాసి—అమ్మగారూ! మన చెలికాని వెంకయ్యగారువచ్చి వాకిట నిలిచియున్నారు దేవిగారితో మనవి చేయు మని సెలవిచ్చినారు.

మల్లి—పితృప్రతిమానులగు వెంకయ్యగారికిం బ్రవేశింపరాని తావులు గలవే? శీఘ్రంబునం బ్రవేశపెట్టుము.

దాసి—చిత్తము. (నిష్క్రమించుచున్నది.)

వెంక—(ప్రవేశించుచు)

చ. అనదలు బేలలున్ నిరప ♦ రాధులు సాధువులున్ బతివ్రతల్
వనితలు వారిఁ జంపుమని ♦ వ్రాసెను నానుదుటన్ విధాత లోఁ
గనికర మింత లేక, కను ♦ గానక తొంటిభవమ్ములందు నేఁ
బొనరిచినట్టిపాతకము ♦ వోయిది దీనికి నేరు దిక్కరో!

మల్లి—బాబయ్యా! యేమి యీ వెఱ్ఱితనము!

చ. తెలియఁగ నెంతవారు నిలఁ ♦ ద్రెళ్ళిరి కాని యొకండు మిత్తిక
న్నుల మసిఁబ్రామిపోల్చుటక ♦ నుం గొనియే వినియే యెఱుంగమీ
పొలిసెడుసంతయున్ వినియు ♦ బూమె లెఱిఁగియు నుట్టిగట్టియు
య్యెల లిటులాగుచుందు మని ♦ యెంచుట వెఱ్ఱితనంబు కాదొకో,

మ. మనకుం దక్కినజంతుజాలములకున్ ♦ భావింప విజ్ఞాన మొం
డొనరున్ భేదము, సర్వమాన్ సమతమై ♦ నుండుంగదా జ్ఞానులై

చనుమీఁ వంటిరె నిక్కమైన స్వామికిం ♦ జప్పింపగా న్యాయమే ?
మును రామాదులు పోవరే యొకఁడు నే ♦ భూమిం దిరం బయ్యెనే.

కావున నీ వెంటలకను గొంటెల బాదకుము, నీ వెందులకు వచ్చితివో చెప్పుము. రాజకార్యనిర్వాహకుండవు గమ్ము.

వెంక—అమ్మా! మహారాజు కత్తి నిచ్చి నన్నంతఃపురమునకుఁ బొమ్మని యాజ్ఞాపించినాఁడు వచ్చినపని నివేదించుటకు నాకు నోరు రాక పరితపించుచున్న వాఁడ నమ్మా!

మల్ల—అయ్యా! నీవు వచ్చిన పని నాకు దెలియును. దానికి నీవు చింతింప నక్కఱలేదు తొల్లి యల్లాయుద్దీను చిత్తూరుకోట ముట్టడించినప్పుడు పద్మినీప్రముఖరాజపుత్రస్త్రీ లెల్లరును మానభంగ మగునని చిచ్చునం బడి చచ్చి ప్రఖ్యాతి నందరే! మాకు నట్టిఖ్యాతియే రాఁ దలంచుకొనఁ యున్నది.

వెంక—అమ్మా! నాకుఁ జేతులాడకున్నవి. నే నెట్లు రాజాజ్ఞం దీర్పఁ గలవాఁడనో తెలియకున్నది తల్లీ!

మల్ల—చేతు లాడకున్నవి కాళ్ళాడకున్న వన్న మాటలం కట్టిపెట్టుము. కార్యంబు దెరవాఁడవు గమ్ము. నాకా మహారాజు కత్తినిటు తెమ్ము. నీవులోనకరిగి రాజాజ్ఞ నెఱవేర్పుము, (కత్తిబుచ్చుకొనును)

వెంక—హాహా! పరమేశ్వరా! స్త్రీవధాపాతకంబున నన్నుం బడవైచితివిరా! హాహాహా! (అని లోపలికిఁ బోవుచున్నాఁడు)

మల్ల—(కత్తికి నమస్కరించి)

మ. కలనైనం గలుషక్రియావిముఖులై ♦ గన్పట్టు ధర్మస్వరూ
పుల చేఁ దేజము నొంది నీవు జగమున్ ♦ బ్రోవంగ నెల్లప్పుడున్
ఖలులందున్మెడుదానవేనిఁ ద్రుటిలో ♦ నాకంఠముం ద్రుంచి నన్
గలియన్ గూరిచి జీవితేశుపదముం ♦ గావం గదే శస్త్రమా!

(కత్తి యెత్తుచున్నది—తెర పడుచున్నది)

ఇది చతుర్థాంకము.

శ్రీ

# బొబ్బిలియుద్ధము

## పంచమాంకము

స్థలము : యుద్ధభూమిలోని డేరా

[అంతట బాసిలక్ష్మన్నతో నాసీనుండగు బుస్సీ ప్రవేశించుచున్నాఁడు]

బుస్సీ—లక్ష్మన్నా! యుద్ధవిశేషములేమి? మనవారు లెట్లుపోరుచున్నారు?

లక్ష్మ—దేవా! లాడూఖాన్ పురస్సరంబుగా మనసైన్యంబంతయు గోటలోనికి బ్రవేశించుట కనేక సాధనోపాయంబులం బ్రవర్తింపంజేసి జెఱ్ఱిఁ జీమలు మూఁగినట్లు చుట్టును మూఁగి ముట్టడించె. అప్పుడు కోటలోని దాదులెల్లరును బురుజులెక్కి నూనెగాచి పోసియు, ఱాల రువ్వియు, నగ్నిబాణంబు లేసియు సీసెలం బొడిచియుఁ గత్తుల మొత్తియు, బోరి మనవారి నెల్లఁ బోఁ జేసిరి.

బుస్సీ—హాహా! బొబ్బిలిలోనున్న దాదులకు నంత పౌరుషమా! తరువాత?

లక్ష్మ—తరువాత నిరువాగు యోధులకును మహాయుద్ధం బయ్యె.
క, లాడూఖానుం డీసునఁ

బ్రోడతనంబున కొకింత ♦ మోసం బనుచున్
బోడిమిఁ బసపాకిగుండ్లకు
వీడక వప్రపమున కెక్కి ♦ పెనఁగెం గడిమిన్.

బుస్సీ—హాహా! లాడూఖా నెంతపని చేసినాఁడు!

( తెరలోఁ బెద్ద కలకలము)

బుస్సీ—లక్ష్మన్నా, ఆ హాహాకారం బేమి ?

లక్ష్మ—(పరికించి) పరాసువంశ శేఖరా ! మహోపద్రవము వచ్చి నది. లాడూఖాను కోటపై కెక్కి పోరాడుచుండ వీరుఁ డొక్కఁ డుక్కున నాతనిం దుపాకివాతంబెట్టిననతం 'డల్లానబీ' యని క్రిందికి బిల్లమిరంబు వేసి కూలినాఁడు.

బుస్సీ—హాహాహా ! ఎంతపని జరిగినది లాడూఖా నెంత పొర బాటు చేసినాఁడు! తాను సేనానాయకుండై యుండి కోటయెక్కుటకు సాహసింపవచ్చునా! ఆహా! బొబ్బిలివారెంత శూరులు? ఎంతధీరులు! వారితో వైరము వలదన్న నామాట హైదరు వినకపోయెనుగదా! అయ్యో! సేనాని పోయిన సేన లెల్లు పడుచున్నవో కదా ?

లక్ష్మ—హాహాకారము సేయుచు మనసైన్య మెంతయుఁ జెల్లా చెదరై పాఱినం గాంచి హైదరుజంగు చేయెత్తి పిలిచి లాడూప్రము ఖులం బురికొలిపె; వారు నతని నిందించు కొనుచుఁ దెగించికోటపై నోటలేక పడిరి. పూసపాటిరాజు తనదళముతో బారికిందోడుబడియె. అప్పుడు బొబ్బిలి యోధవరులు మహాధైర్యంబున నాయోధనంబు చేసి వారిం బాఱఁ దరిమి రని తెలియవచ్చినది.

బుస్సీ—ఆరెరే! మాలసూ వితిగి పాఱినాఁడా! హాహావీరవరు లార!రంగరాయప్రధాన యోధులారా!మీరెంతఁ బరాక్రమవంతులు,

లక్ష్మ—అది యంతయుం గనుచున్న హైదరు.

శా. లాడూగూలెనులాసుముఖ్యులు గడున్ ♦ లావేది వెన్నిచ్చి తా
రూడంబారిరిసర్వదేశముల ము ♦ న్నోడించు నాపేరునుం
బాడై పోయె నిఁ కేమిచేయుదును నా ♦ వారెన్నగాఁ వేసవే
నాడన్ స్వల్పమువారిగెల్చుటయుఁ గ ♦ ష్టాసాధ్యమయ్యెంగటా

అని చింతాక్రాంతచిత్తుండై తత్తరంపడుచు సేనకాజ్ఞాపించె. అప్పుడు షుకురుల్లాఖాన్, హసనల్లీఖాన్, సిద్దిబిలాల్, లాసూఖాన్, మొద

లగు తురుష్క యోధులును ఛత్రపతి రామచంద్ర ప్రభృతులలో. విజయరామరాజును బుజ్జగించి తమతమ సేనలతో సగ్గడిచుట్టు ముట్ట డించి మహాప్రభూ !

(తెరలోఁ గలకలము)

బుస్సీ—సందడియగుచున్న దది యేమి ? చూడుము.

లక్ష్మ—(కొంచెము లేచిచూచి) హైదరుజంగును విజయరామ రాజు నెవరినో యిద్దఱ నాఁడువారిఁబట్టి యిటకుఁ దెచ్చుచున్నారు.

బుస్సీ—ఎవరువారు ? వారిఁబట్టి తెచ్చుటకుఁ గారణ మేమి ? సరేవిచారింతుముగాక. (అంత స్త్రీవేషధారులగు భటులును, దక్కిన వారును ప్రవేశింతురు.)

విజ—(సలాము చేసి) పరాసువంశాగ్రణీ ! (భటులం జూపుచు) వీరిద్దఱును బొబ్బిలిదుర్గఁబునుండి వచ్చుచుండనాకారవాక్ప్రాక్రమా దులం బట్టి మాకనుమానంబు పుట్టి వీరి నిటుపట్టి తెచ్చితిమి.

హైద—వీళ్ళేబద్మాషుల్ వున్నారు. వీళ్ళకి తగినా సిచ్చా సేయ వాలా వుందీ సర్కారు.

బుస్సీ—(పరికించి తలయూఁచి) మీరెవరు ? ఎందుండువారు ? ఇట కేందునిమిత్తము వచ్చియున్నారు ?

భటు—అయ్యోర్లారు ! మేము ఆడంగులము మాది బొ—కాదు గొల్లపల్లి కూరలమ్ముకో వొచ్చి మోతున్నాం బాబు !

బుస్సీ—ఇంతదండు వచ్చి చుట్టును ముట్టడించి యున్నది. మీరు భయములేక లోని కేదారిని వెళ్లినారు.

భటు—బాబు ! మాకు దండు బయ్యా మేటండి మమ్మేమి సేస్తది ? పెరటిదారిని కోటలో కెళ్ళొచ్చిన్నాం సామి !

బుస్సీ—మీరు తాండ్రపాపయ్య నెఱుంగుదురా ?

భటు—తెల్లోరి లేస్తే లచ్చాపదకొండుమా ట్లొచ్చేవాళ్ళం పొయ్యేవోళ్ళం మాకు తెల్దా బాబూ! తెల్సు.

బుస్సీ—అతఁ డిపు డెక్కడ నున్నాఁడు? ఏమిచేయుచున్నాడు?

భటు—దొరగోరు! ఆదొరగోరు కోట్లోనే వున్నారండి. యుద్దప్ప యత్తం సేస్తున్నారు. బాబో! సెప్పలేమ్ ఆకత్తులేయ్ మ పాకులేయ్ లచ్చల్లచ్చలే మోగుసేశారు బాబు!

బుస్సీ—(భయముతోఁ దనలో) పాపారాయఁడు కోటలోనున్నచో నింక మనపని సున్నయే. కానివిచారించెదంగాక. (ప్రకాశముగా) ఇంత సేనతో నతఁడు పోరుటకుఁ బ్రయత్నించుచున్నాఁడా? ఎట్లు పోరఁ గలఁడు?

భటు—ఆఁకి బయ్యమేం బాబూ! సేత గత్తిముట్టారంటే మీ పిరంగీలు గిరంగీలు తుక్కుతుక్కయి యెగిరిపోతాయి నాసామిఁ రంగా!

విజ—పాపారాయునికిఁ బిరంగు లన్న భయమే లేదా? దానికేమి గాని అతఁ డిప్పుడు రాజాములోనుండఁ గోటలోనున్నాఁడందు రేమి?

హైద—వీళ్ళా దొంగల్నాటా సేప్తాదీ వుంది. వీళ్ళకీ తనిఖీ సెయ్యవాలా హుజూర్!

బుస్సీ—మీమాటలు మాకు సందేహములుగా నున్నవి. మిమ్ము బరీక్షించెదము.

భటు—అమ్మకో వచ్చినోళ్ళం మ మ్మెందుకండి పరీచ్చ? మాకా డేటుందండి?

బుస్సీ—లేకున్నచో మాకు భయము లేదు. మిమ్ము విడిచిపెట్టెదము. మీదుస్తులు వస్తువులును జూపుఁడు.

భటు—(భయముతో నొకరి నొకరు చూచుకొనుచున్నారు.)

విజ—ఏమి సంశయించుచున్నారు? మీరు కూర లమ్మవచ్చినవారేని మీకీభయ మేల?

హై——మీకీ పరిచ్చ సేస్తాం వోయ్. లిన్గా సూపూ లేకపోతే తలా పోతాదీ మీకీ ఖబడ్దార్. (కట్టుకొని పోవుచున్నాడు.)

భటు——అయ్యో! నాయేబుదుర్! కళ సలాం అనేశ్యాం మాట్టు కోక బాబు! తప్పు బాబు! అన్ని సూపుతాం సూడు బాబూ!

(తట్టలు నేలఁ బడవైచి రొమ్ములు మొకలైనవి వెదజల్లుచున్నారు)

బుస్సీ——(పరికించి) వీరిబట్టలలో నేమున్నదో కాని తట్టలలో నేమియు లేదు వీరు నిజముగాఁ గూరలమ్ముకొనవచ్చినవారే యని నాయభిప్రాయము

హైద——వీళ్ళూ దొంగల్ వున్నార్. వీళ్ళకీబట్టల్ తనికీ సేసి సమ్మ రాలావుంది. లేకపోతే సఫాయి సెయ్యవాలా వుంది (బట్టలాగఁ బోవును)

భటు——ఆడంగులం బాబో! మాట్టుకోకు బాబో! తప్పుబాబో! తప్పుబాబో! (ఇటునిటుఁ బఱుగులెత్తుచున్నారు.)

హై——అరే బద్మాష్! తమాషా కర్తేహైతూ!

(కొప్పుబట్టి లాగుచున్నాఁడు ఆదియూడి చేతిలోనికి వచ్చుచున్నది)

హై——క్యారేభాయ్! మొగది వున్నదీ?

(కట్టుకొంగుబట్టి యూడలాగఁగా చడ్డీతోఁ బురుషుఁడు కనుపించును)

విజ——(రెండవవాని నట్లు చేయుచున్నాఁడు)

భటు——(మొలకు నొడ్డాణముగాఁ జుట్టుకొన్న కత్తులు తీసికొని త్రిప్పుచు) మేము రంగారాయని ప్రథాన భటులము. స్త్రీలము కాము. పౌరుషముగల పురుషులము పురుషులైనవారందరు మమ్మెదిరింపుడు

అందఱు——(కత్తులు త్రిప్పుచుఁ దెరచాటునకుఁ బోవుదురు.)

బుస్సీ——లక్ష్మన్నా! ఏమి యీ మహాయుద్ధము! ఇద్దఱితో నింత మంది పోరఁ జాలకున్నవారు? వీరు వీరపురుషులుగాని సామాన్యులు గారు. హాహా! యేమి వీరికరలాఘవము! మండలాకార పరిభ్రమణం బున వీరికత్తు లెన్ని కుత్తుకలు తీసినవి ?

[తెరలోఁ దుపాకులు ప్రేలుచున్నవి.]

బుస్సీ—లక్ష్మన్నా! బొబ్బిలిభటులఁకూలినట్లున్నా రుపరీక్షింపుము

లక్ష్మ—చిత్తము. దేవా! గోళ్ళఁ బోవుదానికి మనకు గొడ్డళ్ళు పట్టవలసి వచ్చుచున్నది.

అందఱు—(ప్రవేశించుచున్నారు)

బుస్సీ—ఆడవేషము వేసికొని వచ్చిన సామాన్యులిద్దఱే యిట్టి బీరంబు చూపిరి. వీరి మించిన వారెందఱుందురో? వారిం జంపుట మన కసాధ్యము మన మింక మఱలి పోవలసినదే. పాపారాయఁడే కోటలో నున్నచో మనల నల్లుల నలిపినట్లు నలిపివేయక మానడు.

విజ—మహాప్రభూ! దేవరవారు దీని కింత చింతింపఁ బనిలేదు. పాపారాయఁడు లేడు. మనకీయుద్ధమున విజయము సులభసాధ్యము.

లక్ష్మ—స్త్రీ వేషధారులీయిద్దఱును బావరాయనికి వార్తాపత్రికం గొనిపోవుచున్నారని నాతలంపు.

విజ—ఇదియే నిజము. కాని వీరికడ జాబు కనఁబడకుండుటాశ్చర్యము.

అందఱు—(వెదకుచున్నారు.)

లక్ష్మ—నాకుఁ జూడ జాబీరొట్టెలలో నుండునా యని తోచుచున్నది.

హైద—(రొట్టె నలిపి తాటియాకుం బట్టికొని) అరే వాల్లా! రొట్టెలు నడుమాజాబుల్ పెట్టివండినార్. దేఖోమయా! దేఖోదేఖో

విజ—(పుచ్చుకొని కడిగి తుడిచి) అన్నా! ఎంతమోసగాండ్రు బొబ్బిలివారు! పిండిలో జాబు పెట్టి రొట్టె కాల్చుట యెచ్చటను జూడలేదు హా హా హా! (అందఱకుం జూపుచున్నాఁడు)

బుస్సీ—రాజా! జాబు చదువుము.

విజ—చిత్తము. (చదువుచున్నాఁడు)

నాప్రియుఁడైన బావపాపారాయనికి రంగారాయఁడు వ్రాయు విజ్ఞాపనము.

శా. బావా! రాముని మోరకృత్యమున లో♦ భస్వాంతులాశాత్రవుల్
వేవేల్ త్రోవలు గానిత్రోవలను దో♦ర్వీర్యంబునన్ వచ్చిబల్
తేవం గోటను ముట్టడించి రిపుఁ డు ♦ డ్డీనంబునన్ వచ్చి నీ
చేవం జూపి విపత్తునుండి తొలఁగం ♦ జేయుం గదే నీప్రజన్.

రంగారాయుఁడు.

బుస్సీ—అమ్మయ్యా! ఇప్పటికి నాకు గుండె నిబ్బరమైనది. పాపయ కోటలో లేనిమాట నిశ్చయమైనది.

విజ—దేవా! నేను మనవి చేసికొనియుండ లేదా?

శా. వీపుం జూపెడునట్టి క్రోలుపులి కిం ♦ తేఁదగ్గిపోనట్టి యా
పాపారాయఁడు లేఁడు వీట నితఁడుల్ ♦ భావింపగా నెంతవా
రీపట్లన్ నెఱకాఁడు లేని చెలి వ ♦ ట్లీగోటఁ జూజాయలన్
జేపట్టం దగు నీదు యోధుల కిఁకం ♦ జింతింపఁగా నేటికిన్.

హై—పాపయ్యాకీ హింతా ఫికరూ పడతాక్ వాడూకావ్ వాడి తాతా వస్తేనేమివోయి చనంతో పేల్చివేస్తామ్

లక్ష్మ—

మ. యవనాధీశ్వర! తాండ్రపాపయ మహా ♦ ప్రారంభశుంభత్ప్రభా
వవిధిజ్ఞుం డని నాకునుం దెలిసె నీ ♦ వాక్యంబు కాదం చనం
దవులం గాని జయింపరా దతని నీ ♦ దండంతయుం గూడినన్
నవిమర్శంబులు రామరాజనుడు లె ♦ న్నన్ దీని కిం తేటికిన్.

బుస్సీ—మన కిపు డావిషయమై చర్చింపవలసిన పనిలేదు. పాపారాయఁడు మహాసమర్థుఁ డనుట నిర్వివాదాంశము. ఏది యెట్లయిన నతఁడు లేఁడు గావున మనకు విజయం బగు నింక మీరెల్లఁ జింతఁ దక్కి పోరునకుం బొండు. (తెరలో గలకలము)

దౌవారికుఁ—(ప్రవేశించి) సలాముా లేకుం బందగానేయాలీ! కోటల్‌కీ దాటి ఆడావాడూ వస్తాడ్. వొకటి బొమ్మన్ బచ్చాకు

తెస్తాడ్. మనవార్ హుంసయం దోచీ వానికీ పట్టీ తెచ్చాం సెప్పినార్ సాహెబ్.

బుస్సీ—వారిని శీఘ్రమునం బ్రవేశ పెట్టుము.

దావా—చిత్తం చిత్తం. (నిష్క్రమించుచున్నాఁడు)

[అంతచిన వేంకటరావు నెత్తికొని దాసీలక్ష్మి యుకొండజవానులు ప్ర॥]

జవాన్—వీడికి హనుమానంసే పట్టి తెచ్చినామ్.

విజ—(పరికించి) ఈ కుమారుఁడు రంగారాయనికుమారుఁడనియు నిది మల్లమాదేవి దాసి యనియు నేనూహించితిని.

బుస్సీ—(వారిందిలకించి) ఓసీ! ఈకుమారుఁ డెవరు? నీ వెక్కడికి వీనిం గొనిపోవుచుంటివి?

దాసి—(వడకుచు భయ మభినయించుచున్నది.)

హైద—దొంగా ధగిడీ యిద్ది దీస్కొ పట్టీ కొయ్యావాలా వుంది.

విజ-మ. తళుకుంబంగరుజాలుడీ లిడెను మేల్ ♦ దై వారు నెమ్మోమునన్
నెలరాముద్దుఁలు మూటగట్టు మొగమున్ ♦ నిద్దంపు చెక్కిళ్లుచే
రలఁగొల్పొందగు వాలుగన్నులును దో♦రంబైన బ్రేల్చేతులుం
గలయీపుత్రుఁడు రంగరాడ్విభునకున్ ♦ గాకేరికింబుట్టునే.

ఇతఁడు రంగారాయని కుమారుఁడు. వీని నిది రక్షించుటకుఁ గానెటకో గొనిపోవుచున్నది.

బుస్సీ—ఓసీ నీవు భయము లేదు. నిజము చెప్పుము, నిన్ను రక్షించెదను.

దాసి—అయ్యా! నేను—(వడకుచు) మల్లమాదేవి దాసిని, నాపేరు వేంకటలక్ష్మి.

బుస్సీ—ఈ కుమారుఁ డెవ్వరు?

దాసి—ఈపిల్లవాఁడు శ్రీ—రంగారాయ మహారాజ కుమారుఁడు. వీని పేరు చినవేంకటరావు

బుస్సీ-వీని నెటకుఁ గొనిపోవుచుంటివి? బ్రాహ్మణవేష మేలవైచితివి?

దాసి—అయ్యో! వీనిని సంరక్షించుటకు సామర్లకోటకుఁగొనిపో వుచుంటిని వీనిం బరాసులు పట్టుకొందురో యని భయంబునంజేసి

చ. ప్రకటముగాఁగ బాడబుల ♦ బాలుని వేషము వేసి దారిలో
భిక్షము నెత్తికొంచుఁ గడు ♦ భీతిన మెట్టుచుఁ బోవుచుండఁగాఁ
నకటకటా! మొకంబులకు ♦ నైభయకంబకు దాఁకొనఁ జే
రుకొనఁగ నయ్యెదయ్యపు గు ♦ రుల్ గడవంగ సమర్థ దుండునే

గీ. మల్లమాదేవి దా నిట్లు ♦ మెల్లమెల్ల
బాలకుని గొంచుఁ బొమ్మని ♦ పంపె నన్ను
నేను సామర్లకోటలో ♦ వీనిఁ జేర్ప
వచ్చి యిట్లైతి నేమందు ♦ వ్రాతఫలము.

గీ. కోటలోపలి వారలు ♦ కూలిపోవ
బాలకుఁడు దిక్కులేక తా ♦ కూలు నంచు
నెంచి యిటు సేయు నిట్లయ్యె ? నేమి సేయు
దాన నెటు చొత్తు నింకేది ♦ యూను దిక్కు.

బుస్సీ—కోటలో వారందఱుం గూలుట యేమి?

దాసి—మ. ఆకటా! యేమని చెప్పుదాన జగదీ♦శాలక్షుసైన్యంబుపో
రికి రా భీకరవృత్తి నల్పబలు లా ♦ రేచర్లవారెట్లు చా
వక నిల్వంగల రిట్టిచో నగరిలో ♦ వామాక్షులున్ మానభం
గకరం బౌనని వచ్చునంచుఁ దెగ సం♦కల్పించి రెల్లానకో

బుస్సీ—కటకటా! కోటలో నాబాలగోపాలముగా స్త్రీపురుష జనం బంతయును జావనెంచి సాహసించియున్నదా? (విచారించుచు) విజయరామరాజా! నీవెంత ఘోరకృత్యంబునకొడిగట్టితివి. బొబ్బిలి వారింత శౌర్యవంతులు మానవంతులునని చెప్పవైతివిగదా? మనము చతురంగబలంబులతోఁబోయిన వారువచ్చి శరణుఁజొత్తురంటివిగాని

చత్తురని చెప్పక నన్ను మోసముచేసితీసికొని వచ్చితివి గదా! ఇంక మన మేమి చేయవలసియున్నది?

హైద — దుమ్మాగుల్ వారికీ మీాద విచారం సెయ్యావాలా జరూర్ లేద్. లేకాపోతే వారూవచ్చీ మనకీపాద్దనా సెయ్యాకాపోర్. మన లచ్చం వారికీ లేద్. మనకీ సంపవాలా వున్నార్.

లక్ష్మ — ఈతండు చెప్పినట్లు వారు పరమదుర్మార్గులు. అందఱు మహారాజులువచ్చి మనదర్శనముచేసినారు కానివారురా లేదుకదా!

క. ఎదిరించునట్టివారల
బెదరించి యడంగఁ ద్రొక్కి ♦ చిత్తచ్యుతిమై
గొదలంద జేసి కూల్చుట
పొదలినధర్మంబు గాదె ♦ భువనేశులకున్.

కావునమనమిపుడువారితోయుద్ధముచేసి వారినిసంహరించుటరాజ ధర్మంబుగాని ధర్మవిరుద్ధంబును బాపంబునుగాదు. చిత్తగింపుము.

మ. కినుకన్ రాముఁడు రావణుం దునుమడే♦కృష్ణుండు కంసాదులన్
దునుమన్ లేదె కిరీటి కుంభభవునిన్ ♦ దూలింపఁడే ధర్మజుం
డును శల్యుం బరిమార్పఁడే గురుసుతుం♦డుంగోయఁడేదాయలన్
మన మేపాటిమహాత్ము లెంద ఱరులన్ ♦ మాయింప రేపోరులున్

విజ — వెలమవా రందఱకు నందు విశేషించి రావువారికి సురభి మానంబు మెండు. శౌర్యవంతుల మని కన్నుఁ గానక ప్రభువులపైఁ బ్రతిఘటించి యున్నవారు వారి నెల్లరం ద్రెళ్ళ నేయుట యుత్తమంబ కాని యనుత్తమంబు కాదు. మఱియును.

క. ఈమన్మాత్రుండ నైనన్
ద్వేషించినవానిఁ ద్రుంప ♦ విహితము శత్రో
శ్శేషం న శేషయేత్తను
భాషణము విభూషణంబు ♦ ప్రభువర్యులకున్.

కావున నీరంగరాయకుమారు నిపు డనుగ్రహించి పుచ్చితిమ యేని మన కెప్పటికైన పీనివలన ముప్పు రాకమానదు దేవర యాజ్ఞయేని పీని విషయ మాలోచించెదంగాక.

బుస్సీ—(ఆగ్రహముతో) ఓరి దురాత్మా! నీనాలిక చీలికగాను రాక్షసాధమా! నో రెఱుంగని పసిబాలుంజంప నీ నో రెట్లాడినదిరా? పశుప్రాయుఁడా! నీది బిడ్డలం గన్నకడుపు కాదురా! పాపాత్ముఁడా! ఈ కసుగందు నిన్నేమి చేసెనురా? క్రూరుఁడా! ఇట్లుపలికిన నిన్నేమి చేసెదనో చూడురా? (పరికించి) ఓహో! లాసూ—ర

విజ—(భయ మభినయించుచున్నాఁడు)

హైదా—హీంవిజయరాజా పబువులాతన్కుంసెప్పీనాడ్ గాని దుసరా లేద్. కోపం సేయకా పీని రచ్చించావాలా పార్దనా సేస్తాన్ సలాం సేస్తాన్ రచ్చించా వాలా రచ్చించావాలా సర్కార్!

లక్ష్మ—క. ఋణశేష మగ్ని శేషము

రణ శేషము కూడ దనుచు ♦ రాజులధర్మం

బణుమాత్రమైనదానిం

గణియింపమిఁ గీడువచ్చుఁ ♦ గద లోకేశా.

దీనం జేసి మన విజయరామరా జిట్లు చెప్పెనుగాని—

సీ. పాలబుగ్గలవాని ♦ పసపునిగ్గులవాని

పున్నమనెలఁ బోలు ♦ మోమువాని

వాలుఁ గన్నులవాని ♦ వ్రేలు చేతులవాని

చుట్టువాటిన లేత ♦ చుంచువాని

మొలక నవ్వులవానిఁ ♦ జిలుక కొలుకులవాని

డంబైన తొగరు గ ♦ డ్డంబువాని

ముద్దు గుల్కెడువాని ♦ ముచ్చటాడెడువాని

ముక్కుపచ్చలఁ దేరు ♦ మురువు కాని

గీ. కాలు సేతులు గదలించి ♦ లీలనాడు
నట్టివానిని గనుపండు ♦ వైనవానిఁ
జెలఁగు చిన్నారి పొన్నారి ♦ చిట్టివాని
వీనిఖలుఁ డైన జంపింపఁ ♦ బూను నోటు

బుస్సీ—దానం జేసియూ యిట్లు పలుకుట, కానీ వీనిరక్షించుటయే పరమధర్మముగాని శిక్షించుటధర్మంబుగాదు. పాతకంబు కాకరంబు మన కీచిఱుతవలన వచ్చు నపాయంబును లేదు వీనిం జూచినప్పటి నుండియు నాహృదయంబు దయార్ద్రంబై పరితపించుచున్నయది.

విజ—మహాప్రభూ! నోరు లేని పిల్లవాఁ డితఁ డేమిచేయుననియా! ఇది పులిపిల్ల ఏమిచేయునో దేవరయే గ్రహింతురుగాక.

బుస్సీ—(శాంతించి) వీనిశౌర్యమెట్టిదో నాకిపుడు చూపఁగలవా!

విజ—చిత్తము. (కుమారుని చెంతకరిగి) బాబూ! నీవెవ్వరిబిడ్డవు?

కుమా—నీ కే సిప్ప.

హైదరు—నీ పేర్సెప్పు బేటా?

కుమా—నీకెందుకు సెప్పాలి? నువ్వేఁడు?

బుస్సీ—నాయనా! మీనాయనగారి పే రేవరు?

కుమా—నీ మంచి, నీకు సెప్తా దంగా దావుగాద్.

అందఱు—(ఆశ్చర్య మభినయించుచున్నారు)

దాసి—(కుమారుం బొదువుకొని దుఃఖించుచున్నది.)

కుమా—లచ్చిమీ! యేడవకే యేడవకే నీకు బయ్యంలేదు. వీల్లం ఉల్నీ చితకొత్తేస్తాను. బయ్యంలే దేడవకే.

విజ—(నానాఫలములు, కజ్జాయములు, బొమ్మలు, సొమ్ములు, కత్తులు మొదలైనవి బల్లమీఁదన సమర్చించి) కుమారా నీకేమి కావలెనో దీసికొని భక్షింపుము.

కుమా—(మాఱుమోము పెట్టుచున్నాఁడు)

బుస్సీ—బిడ్డా ! యిటువచ్చి యిందు నీకేమికావలెనో తీసికొని తినుము.

కుమా—(చంక దిగి యిటు నడచి కత్తిపుచ్చుకొని యొరతీసి విజయరామునికై చూపి జడిపించి పండ్లు తెగనఱుకుచున్నాఁడు)

విజ—మహాప్రభూ! చిత్తగించారా ? ఇది పులిపిల్లకాని పిల్లిపిల్ల గాదు. మఱిరెండువర్షములు పైబడిన మనలఁ బిడికెట్టక మానదు. కావున నామాట విని వీని నేనుఁగుకాల మట్టించుటకో, ఫిరంగివాతం గట్టించుటకో ముందల యొసంగుము.

బుస్సీ—హాహాహాహా ! మహాపాతకవర్తీ ! పాపాత్ముడా ! ఇట్టి లోకోత్తరగుణాన్వితుం డగు నిక్కుమారోత్తముని జంపుమని చెప్పుచుంటివి ! నేను బాపాత్ముఁడనై నీమాట విని వీనిం దల్లిదండ్రులకుం బెడఁబాపితి నక్కటకటా ! ఇంక నేనీ యుద్ధంబుమాని, నీరాజ్యమంతయు శౌర్యనిధియగు రంగరాయునికొసంగి నాదేశంబునకుం బోయెదంగాక. (క్రోధముతో లేచి) హైదరుజంగూ ! అన్నము పున్న మెఱుంగని పసిబాలుం జంపుమని పలుకు నీకిరాతునిం బిరంగి వాతం గట్టి ప్రేల్పింపుము. ముమ్మాటికి నాజ్ఞ యొసంగితి. వీని నా యెదుటినుండి తొలంగింపుము.

లక్ష్మి—

మ. అనఘారో ప్రభువర్య ! ఘోరసమరం ♦ బోనిప్పు డిట్లాగ్రహం
బవునే? నీకితఁ డుత్తముఁడుగా ♦ కజ్ఞానుఁడే క్రూరుఁడే
సవిమర్శంబుగ రాజధర్మమున నీ ♦ చందంబునం బల్కినాఁ
డపమార్గంబునఁ బట్టలే దితని ని ♦ ట్టాడంగ న్యాయం బటే.

చ. శరణము నొంది దీనుఁడను ♦ సాకు మటంచును వేఁడ నీతని
గరుణ దలిర్పఁగా నభయ ♦ కల్పితదాన మొసంగి ప్రోచియున్

వరదుఁడవైన నీవొక ♦ నెపంబునఁ జేసివధింప నెంచుటల్
గురుతరపాతకంబగుఁ గోపము దీర ననుగ్రహింపవే.

విజ—(బుస్సీ దిక్కు మొగంబై)

మ. అపరాధం బొనరించినాఁడ నరిశే ♦ షాపేక్షనీ బాలునిన్
కృపలే కజ్ఞుఁడనై వధింపు మనుచున్ ♦ నీచోక్తులం బల్కితిన్
విపరీతంబయి ప్రాణగొడ్డ మగుచున్ ♦ వింతల్ జనించెం గటా
కృపతో నన్ను ననుగ్రహింపు మికఁ దండ్రీ! తప్పుసైరించుచున్

హై—రాజా కా తప్పూ లేద్. మెహర్బానీ రఖోసర్కార్ !

బుస్సీ—మీ రందఱు నింతగాఁ జెప్పుచున్నారు గావున నితనిం గటాక్షించితి రాజా! నీవింక బుద్ధికలిగి మెలంగుము సేనానాయకులారా! మీరీకుమారుం దీసికొనిపోయి నాపటకుటీరంబున సంరక్షింపుడు (అని కుమారుంబొదవి తొడపైఁ గూరుచుండంబెట్టుకొని ముద్దులాడి కుమారా! నీకేమి కావలెను? కజాయుంబు వెట్టింతునా? తండ్రీ !

కుమా—ఊహూఁ! (విజయరాముఁజూపి) వీన్నీ కొత్తాలిక త్తియ్యి

అందఱు—(ఆశ్చర్య మభినయించుచున్నారు)

బుస్సీ—తండ్రీ! నీవీ దాసితో నాయింటికి వెళ్ళి సుఖంబుగా నుండుము. నేనిదె వచ్చి నీ కన్నియు నిచ్చెదను. (దాసి కందిచ్చును)

(తెరలోఁ గలకలము)

హైద—బడాయుద్ధం జరుగుతాదీ వుంది. మాకీ పోవాలాహుకుం దేవ్.

బుస్సీ—సరే! మీరందఱు బోవచ్చును.

బుస్సీ—(తనలో) హైదరును విజయరాముఁడును నన్ను మోసము చేసినమాట నిజము. బొబ్బిలిరాజులు, నిర్దోషులు, అభిమానధనులు. వారి బ్రొందించుట మహాపాతకము, పోరాటంబుమాని వారిరాజ్యము

వారి కిచ్చి పోవుదునా? (ఆలోచించి) ఇంతకు వచ్చిన తరువాత నేను వెనుకదీయుట మంచిదికాదు. నన్నెల్లరును బిఱికివాఁడందురు. కానీ! కానున్నది కాకమానదు (ప్రకాశముగా) లక్ష్మన్నా! యుద్ధమెట్లగుచున్నది?

లక్ష్మ—(చూచి) దేవా!

మ. అదిగో చూడుము కోటకొత్తడమునన్ ♦ హసాప్పజారితోఁ
బదివేలేన్గుల శక్తిగల్గి యటుద ♦ ర్పంబొప్పచరించునా
చదురుండే సుమి రంగరాయ విభుఁడా ♦ చక్కిన్ మహాశౌర్యసం
పదతో నిల్చిన యోధులే తెలియధ ♦ ర్మారాయముఖ్యుల్ ప్రభూ!

బుస్సీ—ఆహా! రంగరాయఁడు శౌర్యమెల్ల మూర్తీభవించినట్లు కన్పట్టుచున్నాఁడు. వీనిదర్శనంబునం జేసి నాకన్ను పండువయైనది (పరికించి) ఓయీ! మన సేనలు పాఱుచున్నవేమి?

లక్ష్మ—

మ. నరసారాయఁడు ధర్మరాయఁడును జి ♦ న్నారాయఁడుం దొట్టిపో
టరు లెల్లం జెలరేగి తెంపు మెయిఁ గో ♦ టన్ వీడి పై వచ్చి మేల్
కరవాలంబులు నీటెలన్ సురియలున్ ♦ గైకొంచుఁ బోరంగ హై
దరు ముఖ్యుల్ వెఱగందిపాఱెదరదే ♦ ధైర్యంబువోనాఁడుచున్

బుస్సీ—ఛీ ఛీ! మనసేన కాలినట్లే యున్నది. అదిగో హైదరు జంగు విజయరామునితో నేమో ఘోషించుచున్నాఁడు విను.

లక్ష్మ—హైదరుజంగు సైన్యమంతయుం జెల్లాచెదరై తాను దెబ్బలు తినియున్నవాఁడగుటం జేసి విజయరాముని నిట్లు పలుకుచున్నాఁడు.

ఉ. ఎందఱో మన్నెగాండ్రు గల ♦ రెందఱో వీరులు శూరులుండి రే
నందఱకన్న మిన్నగ మ ♦ హాహవమందు ప్రశస్తికెక్కెడన్
ముందఱఁ జూడుమంచుఁ బలు ♦ ముచ్చటలాడితి వప్పు డిప్పు డీ
క్రందన నంతయున్మఱచి ♦ కాల్కొలఁదిం బరువెత్తుచుంటివే.

ఉ. మాయలు కొన్ని పన్ని మతి ♦ భ్రాన్పడఁ జేసిమరం బొనర్చిన
న్నాయితపెట్టి పాపమున ♦ యాదు బిడల్ పడఁ జేసి నీచుఁడా!
రాయల కొంపఁ దీయుటకు ♦ రాజ నటించుచు విఱ్ఱవీఁగు నీ
వీరుడఁ జాతి పోఁ దగునె ♦ హీనము గాదె కులంబునీతికిన్.

విజ—(పాడకట్టి)

ఉ. ప్రాణము తీపు గాదె యెటు ♦ వంటి పరాక్రమ శాలికైన నా
రాణువ యంతయుం దెగియె ♦ రాజ పరాక్రమ విక్రమంబునన్
ద్రోణుఁడువోలెఁ దెంపు మెయిఁ ♦ ద్రోపడఁ జేయుచువచ్చుచుండెగం
ఖాణము లేన్గులుం దెగలెఁ ♦ గాల్బలఁదిం బరువెత్తె కెట్లగున్

బుస్సీ—విజయరాముని పరాక్రమం బింతటిదియా! చాలుచాలు రంగరాయఁ డేమో పలుకుచున్నాఁడు, సద్దు చేయకుము

రంగా—(పాడకట్టి)

చ. నిలు నిలు నీచరాడ! నిను ♦ నీ బలగంబును బిండిపిండిగా
నలిపెదఁ గాళ్ళఁ జేతులను ♦ నా బలమెల్ల జనుల్ నుతింపగా
వెల లెవ వేలసంగరము ♦ పెల్లభియూనము వీటబుచ్చి బ
చ్చలకడఁ జేరి యిచ్చకము ♦ జూపుట గా దిది విచ్చుకత్తిరా.

లక్ష్మ—దేవా! నరసరాయ డేమో విజయరాముం దిరస్కరించి పలుకుచున్నాఁ డాకర్ణింపుము.

నర—ఆ. ఓరి విజయరామ ♦ పాతె డేలర మాట
లాడి నక్లై యనుచు ♦ నైతి వేమొ
గంపసిరులు గావు ♦ గాలంపు సిరు లివి
చక్కనిలుము నిన్ను ♦ నుక్కడంతు

బుస్సీ—ధర్మారావు హైదరు దిక్కు తిరిగి నాఁ డది విను.

ధర్మా—(పాడకట్టి)

చ. తులువ కళింగ రాజనకుఁ ♦ దోడ్పడి నన్నపు డీవుపట్టుకోఁ
దలఁచిపుయనార్యమున్ సలుపు ♦ దారిదొలంగితి వేమి యయ్యెనిన్

బిలుగురఁ జేసెనం మరక ♦ బిడ్డవయోని భయంబుఁ దక్కి నా
కెలన నెదుర్చు మిప్పు పస ♦ కేగిన హైదరుజంగు సాహెబూ.

బుస్సీ—మాచితివా సేనలన్నియు మఱలఁ బుఱికొని మహాయుద్ధంబు నేయుచున్నవి ?

(తెరలో మహాకలకలము)

లక్ష్మి—హాహా! మహాప్రభూ! కంటిరా ?

శా. ఘోరంబయ్యెదిరంగరాయసుతునుమీ ♦ కుంగూర్చులాఖానుడున్
హోరాహోరి బెవంగిశస్త్రములతో ♦ నుక్కెక్కి తారొండొరుల్
బారిం బెల్ గొని వైచికొందు ధరణీ ♦ భాగంబునం గూలి రా
హోరావం బునయింప నొక్కపరి యో ♦ ధాగ్రేసరుల్ భీతిలన్.

బుస్సీ—హాహా! రంగరాయమహారాజ! భూమండలాఖండలుండ వన నొప్పునిన్ను నే మూర్ఖుండనై నిధనంబు నొందించితినిగదా! నే నెంత పాపాత్ముడను, నీవెంత పుణ్యాత్ముఁడవు. మమ్మాతువ్భులోకం బునం బడవైచి నీవు వీరస్వర్గ మనుభవింప నేగుచుంటివా! పుణ్య రాశీ! మీరెంత పుణ్యవంతులో మీకాంతలు గూడ నంత పుణ్యవతులే. వారి చావునకును నేనే కారణం బయితిని గదా! హాహాహా (విచారించును)

తెరలో మఱలఁ గలకలము)

లక్ష్మి—అయ్యా! చూడు మదిగో మహాక్రోధముతో నభిమన్యు ననుకరించి వెంగళరాయఁడు సపరివారంబుగా హైదరుజంగు దిక్కు మొగంబై వచ్చుచున్నాఁడు.

బుస్సీ—ఏదారి నెట్లు వచ్చుచున్నాఁడు ?

లక్ష్మి—పశ్చద్వారమునుండి కోటవెలుపలకు వచ్చి తన్నుఁజెంపఁ బొంచియున్న చిన్నబిలాలు నొక్కయేటున రెండుతుండెములుగా నఱికి పండ్రెండువేల మందిని బటాపంచలుగావించి గవ్యూతిదూరంబు పాఱఁ దోలినాఁడు.

బుస్సీ—ఆహా! వెంగళరావు పరాక్రమము! వేయిమందితో నన్ని వేలం దూలపుచ్చినాఁడా? తరువాత?

లక్ష్మ—మఱలి వచ్చునపుడు పొంచియుండి విజయరామరాజా వేగుర మోసంబున నాశనంబు చేసినాఁడు.

బుస్సీ—చీచీ! విజయరాముఁ డెట్లుచేసినాఁడు! పరాక్రమమున్న యెడల నెదుటఁబడి పోరరాదా? తరువాత?

లక్ష్మ— అందు వెంగళరాయప్రభృతులు పండ్రెండుగురుమాత్రము మిగిలిరి. వారే మఱికొందఱం గూడికొని తోఁక ద్రొక్కిన త్రాచులవలె నాలుకలఁ గోయుచు విజయరామ సైన్యంబు దైన్యంబు నొందించి యిట వచ్చుచున్నారు.

[చెప్పినట్లు వేంగళరాయాదులు ప్రవేశింతురు]

వెంగ—ఓరోరి విజయరామ! ఓరి హైదర

ఉ. పాపులు పాపరూపమునఁ ♦ బాల్పడి బుస్సికి బోధచేసి మీ
రీపగిదిం దురంబునకు ♦ నీబలగంబుల నెల్లఁ దెచ్చి మా
పావలఁ ద్రేపులం గొలము ♦ వారల నెల్లరఁ గూల్పనెంచిరా
మీపసపట్టెడన్ మగఁటి ♦ మిన్ నిలుఁ డిప్పుడు నేను వచ్చితిన్.

ఉ. మోసము చేసి లాలు నర ♦ పుంగవు రంగ మహీశశత్రుఁ జా
నేసెను దానఁ దీరు నని ♦ యెల్ల నటించుచు గర్వితాత్ములై
యోసరఁబోకుఁ నీవెలమ ♦ యోధులు కుత్తుకఁ బ్రాణముండగా
వీసము తీసిపోరు మిము ♦ వీసర పుత్తురుగాని ద్రేల్మిడిన్.

హై—(పాఱిపోవుచు విజయరాముం డగ్గరి) నాకి పానసంకటం వచ్చిందీవుంది నికీ నమ్మా నేన్ పిల్లల్కీ మేకల్కీ సెడ్దాన్. నీవుబడా లష్కర్ కలవాఁడూ మాటనమ్మేన్. ఇంకా నానసీబ్ చెడ్డాదివుంది నాకీ నూకల్ సెల్లిపోయింది. సాపూ రాసిందీ నిజం గవాచ్చారం యేమి సెప్పవాలా రాజా (పాఱిపోవుచున్నాడు)

(తెఱలోఁ గలకలము)

బుస్సీ—మనసేనలు మఱల నెదుర్కొనుచున్నవి, హాదుఃఖము.

లక్ష్మ—చిత్తము. వేంగళరాయఁడు తన్నంటి వచ్చుచో హైద రాడిన మాటల కభిమానంబు వొడమి విజయరామరాయఁ డెదుర్కొనియె. అప్పు డెల్లసేనలు తిరుగఁబడినవి.

బుస్సీ—అరెరే! అదిగో వెంగళ్రాయఁ డెల్లర నల్లుల నలిపినట్లు నలిపి సింగంబు లేళ్ళం దోలినట్లు తోలుచున్నాఁడు హాహా! వెంగళ్రా యని శౌర్య మనివార్యముగదా!

లక్ష్మ—సందేహమా? ప్రభువరా!

మ. కలనం బాపయ లేదుగా నతఁడు వేం ♦ గళ్రాయఁడుం గూడినన్
గలశాబ్ధి న్మథియించు మంధరము నాఁ ♦ గల్లోలముం జేసి నీ
బలమెల్లన్ నశియించి పో సమరమున్ ♦ వర్తింపఁగా జేయరే
వెలమల్ ధైర్యహిమాద్రులందుఁ బ్రబలుల్ ♦ వీరెన్న లోకేశ్వరా,

బుస్సీ—వీఁ డెవఁడు కొండం దగరువోలె వెంగళ్రాయనిం దాఁకొను చున్నాఁడు?

లక్ష్మ—వాఁడే సిద్దీబిల్, దేవా! చిత్తగింపు మెట్టి ఘోరయుద్ధ మగుచున్నదో! ఇరువాగులం బోరుచుండునపుడు వెంగళ్రావుపోటులు బిలాలు లాటీతోను బిలాలునఱకులు వెంగళ్రావు డాలుతోను గాచు కొనుచు నందఱకు మెప్పుపుట్టించుచున్నారు. ఇపుడు బిలా లిట్లు పలుకుచున్నాఁడు విను.

"శా. ఎన్నోకోటలు ముట్టడించితిమి మే ♦ మెన్నో మహారాష్ట్రముల్
విన్నాణంబుగఁ గొంటి మెన్నొ దురముల్ ♦ లీలాగతిం గంటిమీ
సన్నాహంబును శౌర్య మెందుఁగన మ ♦ జ్జావేంగళాధీశ్వరా
నిన్నుం జూచిన గుండె బ్రద్దలగుచుం ♦ డెన్నాకు, వేయేటికిన్.

లక్ష్మ—హరహర! ఎంత ఘోరకృత్యము జరిగినదో చూచితివా మహాప్రభూ! బిలా లిట్లగ్గించుచుఁ బరాయత్తచిత్తుండై యున్నతఱి వెంగళ్రాయ నొకవ్రేటు వ్రేసినాఁడు, దాన నతని చెంప తెగిబడినది.

బుస్సీ—ఛీఛీ! బిలా లెట్టి పని చేసినాఁడు?

లక్ష్మ—ఆ వింతచూడు తెగిపడిన చెంపకుఁ గట్టుకట్టించుకొని వెంగ ళ్రావు వానిమీద కెట్టెదికి పలుకుచున్నాఁడో చూడుము.

వెంగ—(కనుపడి) ఓరోరీ దుర్మార్గుఁడా!

మ. నను నగ్గించుచు నేఁ బగాకు పడియుం ◆ డం జెంపయూడంగజో
రుని చండంబునఁ గత్తిని న్విసరితో ◆ రోరీ! మనుష్యాధమా
నిను వీ రెల్లరుఁ జూచుచుండ నిదిగో ◆ నే నీ కృపాణంబునం
దను వింతింతలు చేసి కూల్తు క్షణమా ◆ త్రం జాలినం గాచుకో.

(కత్తిదూసికొని పఱచుచున్నాఁడు. తెరలో! బెద్దకలకలము)

బుస్సీ—లక్ష్మణా! సిద్ధిబిలాలు పనియైనట్లున్నదే అయ్యో! మన సేన కెంతవిపత్తు వచ్చినది?

లక్ష్మ—దేవా! ఒక్క సిద్ధిబిలాలు కూలుటయే కాదు. వెంగళ్రాయని వ్రేటులకు మన సైన్యంబంతయు దైన్యంబు నొందె జంద్రాల్ జానూఖాన్ ప్రభృతి ప్రధానయోధులు నిధనంబు నొందిరి. హైదరు జంగు ప్రాణావశిష్టుండై పడియె విజయరామరాజు చావు దెబ్బలుతిని పాఱినాఁడు. మనవారి దెబ్బకు బొబ్బిలియోధు లెల్లరును ప్రాణంబులు గోలుపోయిరి. అదిగో బిలాలు కొట్టిన దెబ్బ భరింపలేక వెంగళ్రాయఁడును బడియున్నవాఁడు.

బుస్సీ—హాహా! యెంత ఘోరకృత్యము సంభవించినది లక్ష్మణా మన మటకుఁ బోవుదము లెమ్ము. (లేచి కొంచెము నిష్క్రమించుచున్నారు.) (అపటిక్షేపంబునఁ బూర్వోక్తక్రమంబున హైదరును వెంగళ్రాయండును గనుపడుచున్నారు.)

విజ—(వినమ్రుఁడై సమీపించుచున్నాఁడు)

బుస్సీ—(వెంగళ్రాయుని చెంత కరిగి) హాహా! మహారాజా! నేను మూసాబూసిని. నిన్నుఁ జూడ వచ్చితిని నన్నుఁ గన్నెత్తిచూడుము.

వెంగ—(చూచి సంజ్ఞగా సలాము తెల్పుచున్నాఁడు)

బుస్సీ—వెంగళరాయా! నీపరాక్రమం బగ్గింప శక్రాదులకును శక్యంబుకాదు. హాహా! ఒకచెంప తెగియు నీవెట్టివిక్రమంబుగావించితివి. నీయన్న రంగారాయఁడు మహాపౌరుషవంతుఁడు. హైదరు

దుర్బోధనంబునం జేసి మిమ్మిట్లు చేసి ద్రోహంబు గట్టుకొంటి. కడచిన దాని కిపుడు చింతించిన ప్రయోజనంబు లేదు. నీవు చింతించకుము. నిన్ను నా చెంత బెట్టుకొని క్షణౌషధంబు చేసి సంరక్షించెద. భయం బుడుగుము (హైదరు చెంతకు జేరి) హైదరుజంగా! నీ కెంతయవస్థపట్టినది దీని కంతకును గారణ మీవే కదా! నీవీ పాపాత్ముడగు విజయరాముని మాట విని యింత తెచ్చితివి. బొబ్బిలివారితో మనకు గలహంబు వలదని చెప్పిన గోరుందొరమాట విననీయక పంతువంటి బొబ్బిలి వారి సంసారం బంతయు బాడు చేయించితివి. పాపం బంతయు నీవును విజయరామరాజునుం బొందెదరుగాక. (విజయరామునుంజూచి) రాజాధమా! స్త్రీబాల వృద్ధసమేతంబుగా నిష్కారణ మిన్ని వేల మందిని జంపించితివిగదా! స్త్రీజనంబు చిచ్చుపెట్టుకొని చచ్చునప్పుడు కోటలో మంట లేమని నిన్నడిగిన బొడ్లివేడుక లని యెన్నో వారి నేరంబు లగ్గడించితివి గదా! మముబోంట్లు నిన్నుం జూచి నీతోడ బ్రసంగించిన మహాపాతకంబు చుట్టుకొనును అట్లని యిప్పుడు నే జేయవలసిన దేమియును లేదు గావున బీదుకు పెంటలైన కోటం జూడబోవుదము పరిశోధ్ధంబు చేయింపుము

విజ—(తనలో) ఇప్పటికి నాకు జావు బ్రదుకులమీదబొబ్బిలి కోటలోకి బ్రవేశించు భాగ్యంబు పట్టినది. (ప్రకాశముగా) దేవర వారి యాజ్ఞప్రకారము గావించెద.

బుస్సీ—లక్ష్మణా? వెంగళరాయని హైదరుజంగుని బటకుటీరంబునకు చేర్పింపుము. (తెరలో)

చ. జగమున కెల్ల జుట్టమును ♦ జక్షువునై కనిపించు భాస్కరుం
డగముల పాలుచేసి తను ♦ జాంశుల తేజము దూలిపో ఘనం
బగుతమ మాపరించుకొన ♦ నారసి లోపము దీర్ప దర్పమొ
ప్పగ వగమై కళానిధి యు ♦ వచ్చెడు నాబొడకట్టు నిమ్మెడన్.

బుస్సీ—సాయంకాలమగుట వినబడుచున్నది. విడిదలకుం బోదమా?

లక్ష్మ—చిత్తము. (బుస్సీతో లేచుచున్నాడు) (తెర పడుచున్నది)

శ్రీ

# బొబ్బిలియుద్ధము



## షష్ఠాంకము



స్థలము : రాజాము నందలి రాజభవనము

[అంత గాసారామునితోఁ దాండ్రపాపయ్య ప్రవేశించుచున్నాఁడు]

పాప—రామా! నేఁ డేమో నామనం బాందోళనంబు నొందుచున్నయది. కారణ మేమైయుండును?

చ. అడుగులు దిన్నయట్లు మది ♦ నారట మెచ్చెను గుండెజల్లుమం
చడరెడుఁ జల్ల చిల్కు నటు ♦ లయ్యెడు లో దిగులెచ్చె నున్నచో
గడుకొని యుంటకున్ హితవు ♦ గాదెవితోఁ పనుతావ మంగకం
బుడుకఁగ జేయు మిక్కుటమగు ♦ నోయని బీతగు నాకు నిత్తఱిన్,

పరాసులు మాఱుదారిం దేవులపల్లి జేరినట్లిప్పుడేసవసవగాఁ దెలియ వచ్చినది. దుష్టాత్ములు వారేమేమి కష్టకార్యములు చేసియుండిరో గదా! నాబెంగ నూత్రి మిప్పుడు బొబ్బిలియంతయుం దెగ నన్నంత వఱకున్నది. దీని కేమికారణమై యుండునో తెలియరాదు.

రాము—మహారాజ! వేయికన్నులతో నీవు చూచి రక్షించుచుండ బొబ్బిలిపై నీకరైన ప్రాలజాలునా? పరాసులు దేవులపల్లి వెళ్ళినను మళ్ళి రావలసినదే కాని మనయోధుల నేమి చేయగలరు? ఇప్పుడు నీకింత చిత్తవికారమ్మునకుఁ గారణమ్ము లేదు, ఉపశమించి వేగులవారింబుచ్చి వారు దేవులపల్లి వచ్చుటంగూర్చి నిశ్చయంబు లెఱింగి పిమ్మట కార్యంబు దెసం బ్రవర్తించు టుచితం బని నాయభిప్రాయము,

పాపా—సరే! నీవు చెప్పినది మంచిపద్ధతియే, అట్లుచేయుదము గాక, (విని) హజారముకడ సందడి యేమో చూడుము

రాము—చిత్తము (నిష్క్రమించి మరల ప్రవేశించి) రాజా! మన భీముఁడు వచ్చి హజారముకడ వేచియున్నాఁడు

పాపా—వాని శీఘ్రముగనం ప్రవేశపెట్టుము.

రాము—(నిష్క్రమించి భీమునితోఁ ప్రవేశించుచున్నాఁడు.)

భీము—(దుఃఖముతో వణఁకుచు) అయ్యో! అయ్యో!

పాపా—ఏమిరా! అది? అట్లుశోకించుచుంటివేమి? నీ కాయమునం గాయము లగపడుచున్నవి పరాసులు నిన్నుఁ బ్రహరించిరా యేమి? వారెక్కడకు వచ్చినా రెక్కడ నున్నారు?

భీము—అయ్యో! బాబయ్య! అంతయుం బోయినది!

పాపా—ఆఁ! ఆఁ! ఏమిరా అది!

భీము—విజయనగరరాజు పరాసులను మాఱుదారిందెచ్చి కోట ముట్టడించి, అందఱను హతము చేసినాఁడు. బాబూ! చావుతప్పించుకొని యేలాగో బైటఁబడి నేను మీతో మనవిచేసికోవచ్చినాఁడ.

పాపా—హాహాహాహా! పరమేశ్వరా! (పడి మూర్ఛిల్లుచున్నాఁడు)

రాము—(దుఃఖించుచు సేద దేర్చుచున్నాఁడు)

పాపా—(సేద దేరి లేచి కన్నీళ్ళతో) అందఱను హతముచేసినాఁడంటి వేమిరా? అది ఎట్లయినది? ఏమివృత్తాంతము!

భీము—బాబూ! పరాసులు వచ్చి మూఁగినతోడనే మనదొరగారెన్నో రాయబారము లంపినారు. దానికి వారంగీకరింపక యుద్ధము చేసినారు, అందఱి ప్రాణములు పోయినవి.

పాపా—హాహా! పరమేశ్వరా! (పడిమూర్ఛిల్లుచున్నాఁడు.)

రాము—బాబూ! దుఃఖించిన ఫలము లేదు. మీయట్టి పురుషాగ్రగణ్యుల కిట్లు తగదు. లెమ్ము లెమ్ము కార్యమాలోచింపుము.

పాపా—(లేచి దుఃఖముతో) మన రంగారాయప్రభృతులందఱు గాలధర్మము నొందినారా ?

భీము—బాబూ ! అ దఱును,

పాపా—

శా. హాహా! సద్గుణమూర్తి! సర్వనుతశౌ ♦ ర్యస్ఫూర్తి! రంగాధిపా
బాహాబాహిఁ బెనంగి నీ వరులక ♦ ర్వం బెల్ల మాయింతు వా
ద్రోహుల్ నిన్నును మోస బుచ్చి కలనం ♦ దూలించిరే నీకునున్
దేహంబున్ నిడుపాటు వచ్చె నకటా! ♦ దీనుండనై పోయితే.

చ. తొరపడఁగూడ దెందు నని తొల్లి మునున్ వచియింతు వట్టినీ
వరులను శాంతిఁ జేసికొను ♦ నట్టివిధంబునఁ బుట్టకీసునం
దుర మొనరింప నేల నను ♦ దోడుగఁ బిల్వ వదేటి కయ్యయో
ధరఁ బెడఁ బాసి స్వర్గపురి దా ♦ రిని బట్టితె రంగభూపతీ.

సీ. నీశౌర్యధైర్యముల్ ♦ నీ ప్రభావంబును
మంటిపాలయ్యెనే ♦ మానవేంద్ర
నీదు గాంభీర్యంబు ♦ నీదు శౌర్యంబును
బూదెపాలయ్యెనే ♦ పుణ్యమూర్తి!
నీసద్గుణంబులు ♦ నీయోగ్యవర్తనం
బడవిపాలయ్యెనే ♦ యనఘకీర్తి
నీ సాహసంబును ♦ నీశరీరంబును
జమునిపాలయ్యెనే ♦ చక్రవర్తి !

గీ. కటకటా ! సర్వజననాశ ♦ కాల మిపుడు
వచ్చియున్నది గాఁబోలు ♦ వసుమతీశ !
కాక యుండిన నిట్టుల ♦ కలను హెచ్చు
నేను బెడబాసి యుండు ♦ టి దేల వచ్చు.

ఓరీ! సర్వజన నాశనమైన దని చెప్పుచుంటి వంతఃపురాంగన లెల్లున్నవారు ? వారి కవమానంబు వాటిల్లలేదుకదా ?

భీము—లేదయ్యా! లేదు దొరగారు! వారి నందఱను జెలికాని వెంకయ్యగారిచే రక్షించినారు. మల్లమాదేవి తనంతఁ దా రక్షకు గొని ప్రాణత్యాగము చేసికొనియె. దాసులుం జావనెంచినవారిని జిచ్చువెట్టి కాల్చివేసినారు దేవా ?

పాప—హాహా! నాసహోదరీ! మల్లమాంబా! హాహాహాహా!

(పడి మూర్ఛిల్లుచున్నాఁడు)

రాము-రాజా! శాంతింపుము శాంతింపుము (సేదదేర్చుచున్నాడు)

పాప—(సేదదేరి కన్నీళ్ళతో) అమ్మా! మల్లమాంబా!

గీ. అనదవై చాలఁ దపియింప ♦ వైతివమ్మ
మానహానికి శంకించి ♦ మడిసితమ్మ
కొడుకుగతి యేమిగాఁ జేసి ♦ నడిచితమ్మ
మల్లమాదేవి! నన్నుఁ గన్న ♦ తల్లి! నీవు.

అయ్యో! నాప్రియసహోదరీ!

చ. ఒక గెడ నేను గన్పడక ♦ యుండినఁ దమ్ముఁడ! పాపరాయఁడా
సుకముగ నుంటి వయ్య! నను ♦ జూడగ రావదియేమి బావతో
నెకసకియంబులా యనుచు ♦ నెప్పుడు నన్ను దయార్ద్రదృష్టి వీ
డక కనుచుండు తల్లి వక ♦ టా! దివికేగితె మల్లమాంబికా!

ఓరీ! సేవకా! ఇంతపని జరుగునప్పుడు నాకేల వార్త నంపలేదురా ?

భీము—బాబూ! పంపినారు. వార్తాహరు లాడువేషములు వైచి కొని వచ్చుచుండగా విజయరాముఁడు వారిం బట్టుకొని శిక్షించి నాఁడు సామి!

పాప—అన్నా! ఎంతపనిజరిగినది! ఎంతపనిజరిగినది! దుర్మార్గుఁ డట్లు చేసినాఁడా ? కానీ కుమారునిసంగతి యేమైనదిరా ?

భీము — ఆ దొరబిడ్డకు బాపనవేషము వేసి దాసీలక్ష్మితో సామర్ల కోట కంపుచుండఁగా బుస్సీ పట్టుకొని తనయింటం బెట్టుకొని రక్షించు చున్నాఁడు.

పాపా — అమ్మయ్య! వంశాంకురంబు వాఁడైన జీవించియుండెనని విన్న నామది కింత నెమ్మది గలిగినది. పట్టుకొని రనునంతలో చంపి రని చెప్పుదువేమో యనుకొంటినిరా సేవకా!

భీము — అంతపనియు జరిగెడిదే విజయరాముఁడా బాలు నేనుఁగు కాల మట్టింతు ననెం గాని బుస్సీ దాని కంగీకరింప లేదుసామి

పాపా — హాహా! మూసాబూసీ!

చ. కఱకుకులంబునం బొడమి ♦ కష్టు డవయ్యును దుష్టరాజు పెన్
గఱపులఁ గ్రాగుచిత్తమునఁ ♦ గ్రాలెడువాఁడవ యయ్యుఁ గయ్యపుం
గఱకఱివయ్యు శత్రుసుతుఁ ♦ గట్టడఁ బట్టియుఁ జంప నిష్టముం
దొఱయవు నీదునర్మిలికి ♦ నుంగొన సంస్తవనీయ మయ్యెడున్.

ఓరిదుష్టాత్ముఁడా! విజయరామ!

మ. కడుపా నీయది ఖండవల్లిమడుగా ♦ గంగ్రాలనుం గంటివా
కొడుకు ల్లేకుర నీకు రాకొమరునిన్ ♦ గోయింపఁగా నెంతువా
జడబుద్ధీ పర మాపకారి వగు నిన్ ♦ జప్పింప కావంతయున్
గడిమిన్ నే నిదె కండకండలుగ నీ ♦ కాయంబు ఖండింప నే.

సేవకా! మన వెంగళ్రాయునిమాట చెప్పవేమి?

భీము — దొరా! ఆ దొరగారు తన తలసామ దెగినను దాను చెలికాని వెంకయ్య దామెర దమ్మన్న మొదలగు యోధులతో నెన్నో వేలం గూలనేసి హైదరుజంగుం బడఁగొట్టి సిద్దీబిలాలుతోఁ బోరి వానిజంపి తాను పడినాఁడు. అప్పు డా విజయరాముఁ డా దొరకడకు వచ్చి నీవా రందఱుఁ బోవ నీ వేల బ్రతికినావని వేళా కోళము సేసినాడంట అపుడు పడియున్న చిన్నదొర కోపముతో నేఁ బడినను నా బావ నిన్నుఁ బడవేయు నని చెప్పినాడఁట బాబూ!

పాపా—హాహా! వెంకట్రాయా! నీశౌర్య మనివార్యము గదా!

చ. తల సగ మూడినన్ మఱల ♦ దాని నిగట్టిగఁ గట్టి లాలునుం
బిలుకురఁ జేసి హైకరుని ♦ పీచ మడంచి కళింగరాజుఁ గా
ల్లోలఁదిని బాఱఁ జేసి మును ♦ కొన్నబలంబుల వేనవేలఁ భూ
తలముల బండఁ బెట్టి క్రమ ♦ దార్కొని మూర్ఛను నింగి తేకటా!

క. నాతోడు గలుగు నని నం
చాతటి నీ వెంత లోన ♦ నాసం బడితో
నాతండ్రి! నీవు బడలితి
హో! తగ నే నుండి లేక ♦ పోయితి నీకున్.

మ. నిను నాబావ వధించు నేఁ బడిన గా ♦ నీయందు నారామరా
జును నోనాడి వచించితట్టి మఱఁది! ♦ చుట్టాలనున్ నెయ్యురున్
మనుజేంద్రుండును నీవు నెల్లప్రజలున్ ♦ వర్మైన్నచో వాని గూ
ల్చిన లాభం బది యేమి సంతసిలువా ♦ గ్లైనప్పు డీ భూస్థలిన్.

అయ్యో! సేవకా! వేదనాభరంబున నతండీపాటికిపరలోకమునకుం బోయియే యుండును. అవురా! విజయరాముఁ డెంతపని చేసినాఁడు! బుస్సిం దన మాయలోఁ బడవేసికొనియెంగదా!

భీము—వాఁడు చేసినకీడింతింత యనిచెప్ప శక్యమా?

పాపా—రామా! ఇంక మనకుఁ గర్తవ్యమేమి?

రాము—దేవా! నీవు వచ్చి విజయరాముం జంపుదు వని మన వెంకట్రాయుఁడు గంపెడంతాస వెట్టుకొని యుండెగదా! వాని మనోరథంబు తీర్చుటయే మనకుం గర్తవ్యంబు.

పాపా—ఛీఛీ! సర్వబంధుజన నాశనం బైయున్నయప్పుడు వాఁ డెట్టివాఁడైనఁ జంపిన నేమిప్రయోజనము?

క. శూరుడుపాపారాయుఁడు, వీఁడుఁడునామేనమఱఁది ♦ విచ్చేసితఱిన్
వైరుల జంపెననుచు రంగారాయుఁడు సంతసింప♦గా లేడుగదా.

ఇట్టిచో నట్టిప్రయత్నము చేయుటకన్న దప్పేమియును లేదు. కావున మన మిపుడు కాశీప్రయాణ చేయుదము లెండు.

రాము—మన కిపుడా ప్రయాణ మంతపోలి యుండదు. రాజులకు క్షత్రియుంబు చేసి పోరునం దీరుటయే యుత్తమము.

పాపా—(తలవాల్చి కన్నులు మూసికొని యాలోచించుచు) అక్కా! నీవెట్లు బ్రతికివచ్చితివమ్మా! నా ప్రాణవాయువుల వాయువులలోఁ గలిపి నిన్ను జూడవచ్చితి ననుచుంటివా?—అమ్మా! నా కేమియాజ్ఞ?—నీవు కాశీప్రయాణము మాని విజయరాముని౦ బరిమార్చు మనుచుంటివా? దానంజేసి ప్రయోజన మేమి!—దుష్ట సంహారముచేసి పగ దీర్చుకొనుటయే ప్రయోజన మనుచుంటివా? సరే! అక్కగారి సెలవునకు బద్ధుడనై యున్నాఁడను (దద్దరిల్లికన్నులు విప్పి చూచి) రామా! భీమా!

రాము—అయ్యా! యేమి యిట్లు పలవించుచున్నారు?

పాపా—పలవరింతలు గావురా! మల్లమా దేవి నాకంటి కగపడి యిట్లు చెప్పెనురా.

రాము—అయ్యో! ఆమెచిత్త మా దుర్మార్గునిపట్ల నెట్లుత్తలం పడుచున్నదో కదా!

పాపా—కాశీప్రయాణము గట్టిపెట్టుదము కాని విజయరాముని౦ గొట్టుట యెట్లో తెలియకున్నది.

రాము—మనము ముగ్గుర మిపుడు వెళ్ళినిద్రాసమయంబున వాని బట్టికొందము.

పాపా—(ఆలోచించి) రామా! నీమాటవలన నాకశ్వత్థామ జ్ఞాపకము వచ్చుచున్నాఁడురా.

రాము—వారునుముగ్గురే, మనమునుముగ్గురమే. కార్యమునట్టిదే.

పాపా—పులి పులి పులి పులి బొబ్బిలిపులి బొబ్బిలిపులి (కేకలు వేయును.)

రాము—(కత్తితోఁ దెర చించుకొని ప్రవేశించి సేవకులం బట్టి చాటున జంపి వేయుచున్నాఁడు.)

విజ—(దద్దరిల్లి కనులు నలుపుకొనుచు లేచి) ఏదీ!ఏదీ? కొట్టుకొట్టు

పాపా—పులి పులి పులి బొబ్బిలిపులి, బొబ్బిలిపులి, పులి (కేకలువేయును.)

విజ—హాహాహాహా! పా-పా-హాహాహాహా? (లేవంబోవును.)

పాపా—నీపాలి కీపాపారాయఁడే పులి (అని కలియఁబడిపట్టుకొని పడవేసి ఱొమ్మురిూఁదఁ గూర్చుండి పీక నొక్కుచున్నాఁడు.)

విజ—(గిజగిజ గించుకొనుచున్నాఁడు.)

పాపా—ఓరోరి పాపాత్ముఁడా! క్రూరుఁడా)

శా. కొండంబుల్ పదికోట్లుపన్ని బుసికిం ♦ గోపంబు హెచ్చించి నే
నుండన్ రాక మఱొండుచో మెలఁగుచో ♦ నువ్వెత్తుగావచ్చి నీ
దండుంబుచ్చి సమస్తముం జెఱచితో ♦ దౌర్భాగ్యుఁడా! చిక్కితే
ఖండింతున్ నినుఁదుండెతుండెలుగ మొ♦క్కంగాకులుంగుక్కలున్.

చ. తెరచినయిల్లు కుక్కచొఱు ♦ తీరున వీరరసస్వరూప మే
త్తెఱఁ గనుపించి రావుకుల ♦ ధీరులు వోయిన శూన్యమైన మా
నెఱఁగడి వచ్చి చేరితివె ♦ నీచుఁడ! నీ విటఁ గుల్కుచుందు నం
చఱిమఱి వొందుచుంటి వితఁ ♦ డయ్యెను గంతులుసాగిరావికన్.

మ. నిను నీవారిని బెండింపిండిగను ము ♦ న్నేఁ జిత్రకూటాద్రిపై
గవలం గొట్టిననాఁడు బొబ్బిలి నెటో ♦ కాల్పింతు నం చీవుని
న్ననుమానింపఁగ చీల్చి క్రేవు లెదపై ♦ హత్తింతు నం చేను జే
సినబాసల్ సగబాలు సెల్లెఁ గొఱయున్ ♦ జెల్లున్నిమేషంబునన్

క. పీనుఁగు పెంటల నుండిన
మా నగర మ్మేలు మింక ♦ మానవపశువా
మేనం బ్రాణము లుండిన
నే నా జనుపీను నిత్తు♦ నిదిగో కొనుమా
(అని గుండెలమీఁద గ్రుద్దుచున్నాడు)

విజ—(ఓఁక్కారు మనుచున్నాడు)

పాపా—
క ఓఁక్కారు మనియెద వేలా
కిక్కురు మనకుండ నిన్నుఁ ♦ గిల్కాలునకున్
ముక్కలు ముక్కలు సేయక
తక్కితినే మల్లమాంబ ♦ తమ్ముండ నోకో.
(రెండుచేతులు నఱకుచున్నాఁడు.)

విజ—రెండు కాళ్ళం బెనగులాడుచున్నాఁడు.
పాపా—ఓరీ! ద్విపాత్పశువా! యేమి గింజుకొనియెదవురా?
(రెండు కాళ్ళు నఱకుచున్నాఁడు)

విజ—(మొండమై కనపడుచున్నాఁడు)

పాపా—ఉ. వేంగలరాయుఁ డన్ననుడి♦వేంకటరావునుజంపు యత్నమున్
మంగళసూత్రముం బెటికి♦మల్లమ దేవిని బ్రోతు నంటయున్
ముంగల హైదరుం గలిసి♦బుస్సికిఁ జేసినదుష్ట బోధయున్
సంగతిమై భవన్మృతికి♦సాయ మొనర్చెఁ టంచు నెంచుమా!

ఇక్కడకు నామనోరథపూర్తియైనది. కాని నీపొట్ట చీల్చి ప్రేవులు ధరించి నీరక్తంబు మేనెల్లం బూసికొంట మిగులుగా నున్నది.
(కత్తి నెత్తుచున్నాఁడు. తెర పడును.)

(ముగ్గురు—కత్తిశూలాయుధులై ప్రేతరూపు ధరించి భీకరాకారములతో గనుబడుచున్నారు.)

పాపా—(హుంకారము చేయుచు)

మ. ఇపు డత్యుగ్రకరాళక్రమక్రియమునన్ హింసాక్రియారంభు నా
నృపతున్ బట్టి వధించితిన్ బవనన ♦ నేఁ బాపరాయండ నా
త్రిపురధ్వంసకుఁడైన శూలి యయినన్ ♦ దేజంబు దీపింపఁ జ
ట్టుపలన్ గొట్టినవజ్రి యైన నెవరన్ ♦ దుష్టుష్టులం గొట్టఁడే.

సేవకులారా! మనకుఁ బరమాపకారి యైన హైదరుజంగొకఁడు మిగిలియున్నాఁడు వానిం జాపుట కుపాయాంతరం బెద్దియును లేదు గావున మీరు వాయెత్తి పాపారాయఁడు వచ్చి విజయరాముంజంపె నని కేకలు వేయుఁడు.

ఇద్దఱు—ఓహో! హైదరుజంగ! పాపారాయఁడు వచ్చి విజయరాముం జంపినాఁడోహో! (అని కేకలు వేయుచుధ్వని చేయుచున్నారు)

[అంతఁ గొంత సేనతో హైదరు ప్రవేశించుచున్నాఁడు]

పాపా—ఓరోరి ముష్కరతురుష్కాధమా!

స్ర. ఛీఛీ! గోబ్రహ్మహత్యా ♦ ప్రచురదురితభర ♦ చ్ఛిన్నచిత్తప్రవృత్తిన్
నీచత్వోచ్ఛ్రిత్తి చింతా ♦ నియమరహితుఁడై ♦ నీవునిట్లు గాన కిట్టుల్
నీచాత్మం గూడితోడం ♦ [illegible] ♦ న్క్రిక్కలంచంపుఁగూటిన్
ప్రాచీనాచారభాస్వ ♦ త్ప్రభుకులకుల ♦ ధ్వంసముం జేసి తోరీ.

క. నేనే పాపారాయఁడ
నే నెవరైన [illegible] యెవ్వరు ♦ నీబీరమగున్
భూనాథు [illegible]
రా నిన్నున్ [illegible] ♦ [illegible].

(కత్తిదూసికొని కలియఁబడుచున్నాఁడు, తెర పడుచున్నది)

పాపా—(సేనతోఁ బైటకువచ్చి) రామా! భీమా!

చ. మన మిట వచ్చినట్టిపని ♦ మల్లమదేవి యనుగ్రహంబునన్
గను మెదలించులోపలన ♦ గానొనరించితి మింతయుం గొఱం
తను బడకుండ ధన్యులము ♦ తన్మతి కిష్టముఁ గూర్పఁ గంటిమీ
మనుగడ చాలు స్వర్గపురి ♦ మార్గము వట్టి యిఁకన్ సుఖింతమేః

రాము—రంగరాయాదులు లేని భూమిపై బ్రతుకుటకన్న నీచ కార్య మున్నదా?

భీము—నీచులగు పరాసులువచ్చి పడకమున్న మనమే పొడుచు కొని రంగారాయనిం గలిసికొందము గాక.

అందఱు—(కత్తులసవరించుకొనిపొడుచుకొననుంకించుచున్నారు.)

పాపా—(కత్తికి నమస్కరించి) ఓహో! శస్త్రరాజమా!

చ. నినుఁ గులధర్మముం దలఁచి ♦ నే నిసువై చనునంతయుండియున్
గొనియు మహాప్రభావమున ♦ కుందగ నీక నిరర్గళ ప్రవృ
త్తిని గొనఁ జేసి ప్రోచితి గ ♦ దే సకలారిగణాన్ప్రగాప్తినేఁ
డనువు దొఱంగెదం దునిమి ♦ ధర్మపథం బిడు నాకు శస్త్రమా!

(కత్తి నెత్తుచున్నాఁడు, తెర పడుచున్నది)

[అంత లక్ష్మన్నతో బుస్సీ ప్రవేశించుచున్నాఁడు]

బుస్సీ—లక్ష్మన్నా! పాపారాయఁ డెంతో సేనతో వచ్చి విదయు రాము హైదరుం జంపి మనసేనం బాఱఁదోలుచున్నాఁడఁట! మన మందుగుండుసామానంతయు నుపయోగింపుడని సేనకాజ్ఞాపించితిని, మన కేదో యుపద్రవముగా నతఁ డిక్కడకు రాడుగద?

లక్ష్మ—ప్రభువర్యా! పాపారాయనికి సేన లేదు. తనతో నిద్దరం దెచ్చినాఁడు. తనిపగదీర్చుకొని తాఁబొడుచుకొని కాలధర్మమునొంది

వాఁడు. నీనీడచూచి నీవు భయపడినట్లు సేన కాజ్ఞాపించితివి. ఎదరిఁ దమ్మెఱుఁగక తమలోఁదాము గాల్చుకొని పెక్కుమంది చచ్చినారు. మన నూఱువేలకు మూఁడువేలును వారియైదువేలకు నిద్దఱు ముగ్గురు మాత్రము నిలిచి యున్నారు.

బుస్సీ—శౌర్యనిధి యగు పాపారాయనింజూడ నాకు మనము వొడమచున్న దటు నడువుము.

ఇద్దఱు—(నడచుచున్నారు. తెర లేచును. పడియున్న ముగ్గురు కనపడుచున్నారు.)

బుస్సీ—(పాపారాయనింజూచి) అరెరే! ఏమియీ శౌర్యము! ఏమి యీ పరాక్రమము! ఏమియీ ధైర్యము ఏమి యీ స్థైర్యము! మానధనుం డగు నిమ్మహానుభావుండు చచ్చియును నాకు మిక్కిలి భయంబు పుట్టించుచున్నాఁడు. రక్తసిక్తాంగుడై గుడ్లెఱ్ఱజేసి మీసముపై చేయివైచికొని పొడువ వచ్చుచున్నట్లేయున్నాడు. ఆహా! మహాశూరుఁడా! యెంత సాహసము చేసితివి? నీ విట్టివాడ వని నే నెఱింగియు హైదరుమాట విని మోసపోతినిగదా! నీవు సజీవుఁడవై యున్న నిన్నీ దేశంబున కధినాథుం జేసి నీ వలన మేలు పడయుచుందును గదా! కట కటా! యెట్టి ఘోరకృత్యము జరిగినది. లక్ష్మణా! నాకీ పాపారాయనిం జూడఁజూడ గుండెపగులి దుఃఖంబు పెచ్చు పెఱుగుచున్నది: నే నిట నిలువ నోపకున్నవాఁడ. పేరోలగంబునకుఁ బోవుదము రమ్ము.

ఇద్దఱు—(నడచుచున్నారు. అపటిక్షేపఁబున సభాస్థలముగపడును.)

బుస్సీ—లక్ష్మణా! నీవుపోయి చినవేంకటరాయ ప్రభృతులం దీసికొని రమ్ము.

లక్ష్మ—(చిత్తము. నిష్క్రమించుచున్నాఁడు)

[అంత దాసీలక్ష్మితోఁ జినవేంకటరావును, కంచుకియును, లక్ష్మనయు ప్రవేశింతురు]

(బుస్సీ లేచి కుమారు నెత్తుకొని సింహాసనముమీఁద గూరుచుండఁ బెట్టుచున్నాఁడు.

అందఱు—కరతాళధ్వనులు చేయుచున్నారు)

బుస్సీ—(కుమారుంజూచి) బాబూ! నీకు గోత్రపల్లినీమ యొకలుగాని బొబ్బిలిరాజ్య మంతయు నిచ్చితిని. మీ రెప్పటికి విజయనగరము వారి చేతిక్రిందనుండ నక్కరలేదు మీకు మే మెప్పుడును దోడునీడలమై యుండెదము. లక్ష్మీ! నీవీ కుమారుం బెంచి పెద్దవానిం జేయుము? కంచుకీ! నీవు కాలముగడపినవాఁడవు, బుద్ధిమంతుఁడవు, తగినవారిం బెట్టి రాజ్యానుసంధానము చేయుచుండుము. మేముపోయి వచ్చెదము. మఱి నావలన నీకుమారునకుం గావలసిన దేదియో చెప్పుము?

కంచుకి—దేవా! నీ యనుగ్రహంబున నీకుమారున కన్నియు నున్న యవి, అయిన నిట్లుగాఁ బరమేశ్వరునిఁ బ్రార్థించు చున్న వాఁడ.

(భరతపుత్రునిం గలసి పాడుచున్నాఁడు)

మంగళమహాశ్రీవృత్తము.

భూతలమునంజనులు। పుణ్యమునఁబోవుచును। బోల్పదగురీతినుపకారం
బేతఱిని జేయునటు। నీతులునశించిగుణ। మేగలుగునట్లుగహితంబుల్
నీతులపొసంగునటు। నేలలవిపండినసి। నిండునటు శత్రుభయముం తే
జేతములనొందనటు। సిద్ధమగుభక్తివిలసిల్లునటు జేయుపరమేశా.

హిందూస్థానీ కాఫీ—మిశ్రగతి

మంగళముఖలేశా, శుభ—మంగళముఖలేశా
గురుతరదురితవినాశా, శ్రీశా జయ ॥మం॥
పరమపురుష, విగతకలుష, పావన గుణభాషా
శరభక్తజనాధికపోషా, బహువేషా, సువిశేషా, జయ ॥మం॥

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది షష్ఠాంకము.

సంపూర్ణము.



శ్రీ కొండపల్లి ముద్రాశాల రాజమండ్రి.

# శ్రీ మహాభారతము-వచనము

## మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

18 పర్వములు — 16 సంపుటములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | | 4 | 0 | 0 |
| సభాపర్వము | | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము | 1 వ భాగము | 3 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 3 | 0 | 0 |
| విరాటపర్వము | | 2 | 8 | 0 |
| ఉద్యోగపర్వము | | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | | 3 | 0 | 0 |
| కర్ణపర్వము | | 2 | 0 | 0 |
| శల్యపర్వము | | 1 | 8 | 0 |
| సౌప్తికపర్వము | | 0 | 12 | 0 |
| స్త్రీపర్వము | | 0 | 8 | 0 |
| శాంతిపర్వము | | 4 | 8 | 0 |
| అనుశాసనికపర్వము | | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | | 1 | 4 | 0 |

పూర్తిసెట్టు వెల రు 37—8—0

వలయువారు :—

## కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# ఆంధ్రనాటకములు

| | | |
|---|---|---|
| చిత్రనళీయము | 1 | 12 |
| విషాద సారంగధర | 1 | 12 |
| పాదుకాపట్టాభిషేకము | 1 | 8 |
| సావిత్రీ చిత్రాశ్వము | 1 | 8 |
| ముక్తావళి | 1 | 8 |
| ప్రహ్లాద | 1 | 8 |
| రామదాసు | 1 | 8 |
| రామకబీరు | 1 | 8 |
| సుభద్రార్జునీయము | 1 | 8 |
| అస్పృశ్య విజయము (ప్రేమచంద్రయోగి) | 1 | 8 |
| భక్తతుకారామ్ | 1 | 8 |
| కృష్ణలీల | 1 | 8 |
| లవకుశ | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 |
| మేవాడు శౌర్యాగ్ని | 1 | 8 |
| విభీషణ పట్టాభిషేకము (లంకాదహనము) | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |
| రామరావణ యుద్ధము | 1 | 8 |
| సతీతులసి (జలంధర) | 1 | 8 |
| గయోపాఖ్యానము | 1 | 12 |
| పారిజాతాపహరణము | 1 | 8 |
| చతురచంద్రహాస | 1 | 8 |
| శ్రీకృష్ణ తులాభారము | 1 | 12 |
| మార్కండేయ (శివలీల) | 1 | 8 |
| చింతామణి | 1 | 12 |

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి